సీ. గంగాద్యశేషాపగా పుణ్య ఫలయోగ
స్నాయి జనార్పిత స్వర్గభోగ
గంభీర నీరావగాహనోద్యన్నాగ
కలహంసికావృత పులినభాగ
తటతల సంకీర్ణ వటవట పున్నాగ
మౌనికులేంద్ర మనోనురాగ
డిండీర సహితోర్భ పుండరీక పరాగ
ప్రశమితాఘాఘదురంతరోగ

గంధవహాకోటి శతసదృగ్గమనవేగ
తతసమర్థత్వ పరిహసిత ప్రయాగ
దీనహితదాన నిర్జిత దేవతాగ
దూరితోగ్రవిపద్ఘోర దురితపూగ
గౌతమీతటినీస్థల ఘోరరోగ.

—గౌతమీమహాత్మ్యము




# గౌతమి

ఉత్తర హిందూస్థానమున పరమపవిత్రమైన భాగీరథివలె, దక్షిణగంగయని ప్రసిద్ధిఁ జెంది, కోట్లకొలఁది జనులకు జీవనాధారమై యున్న గోదావరీనది బొంబాయి మండలములోని నాశికకు సమీపమున త్ర్యంబక మనుస్థలమున పడమట కనుమలలో జనియించుచున్నది. అచ్చోట నొక కొలను గలదు. ఆకొలనిలోనికి, దరినున్న యొక విగ్రహము నోటనుండి నీరు బిందువులు బిందువులుగా పడుచుండును. ఈచోటు చాల పుణ్యస్థలముగా నెంచి భారతదేశమున పలుచోటుల నుండి తండోపతండములుగ యాత్రికు లరుదెంచి దర్శించి వెళ్లుచుందురు. అచటినుండి యీనది క్రమక్రమముగ పెద్దదై, ప్రాణహిత ఇంద్రావతి, తాల్, శబరి మొదలగు ఉపనదులం గలసి, తొమ్మిదివందల మైళ్లు ప్రవహించి బంగాళాఖాతమునఁ గలయుచున్నది. ఇది రాజమహేంద్రవరమునకు సుమారు నాల్గుమైళ్లు దూరమునగల ధవళేశ్వరము వద్ద రెండుపాయలుగా చీలుచున్నది. ఈ పాయలకే గౌతమీగోదావరియనియు, వసిష్ఠగోదావరియనియుఁ జెప్పుదురు.

భారతదేశమున ప్రజాసముదాయమునకే మూలముననైన యెక్కుడుగ నుపయోగపడు దేనికిగాని, నదికైనను, ప్రకృతిరామణీయకముగు ప్రదేశమునకైనను మాహాత్మ్యము గట్టిపెట్టుట సర్వసాధారణమై పోయినది. అందునను గోదావరి దక్షిణ హిందూస్థానమున ముఖ్యమగు జీవనది. దీనినీటిని పారించు పెద్దకాలువల నిడివియే 493 మైళ్లు, చిన్న

కాలువలు 1929 మైళ్లు. మొత్తమున గోదావరీనదీ జలముచే 6,62,000 ఎకరములభూమి పండుచున్నదని అంచనా వేయబడినది. అంతియుగాక కాలువలన్నియు రాకపోకలకు చాల సౌకర్యములు గలుగఁజేయుచున్నవి. అందుచే గోదావరి జన్మమునుగూర్చియు తత్తీరముల గురించియు మహాత్మ్యములను లేవదీసి సారస్వతమున కెక్కించిరి. వీనిని దెలుపు ఘట్టములు సంస్కృతాంధ్ర సాహిత్యములందు పెక్కు తావుల గలవు. ఒకచో శ్రీరాములు గౌతమమహర్షికి గోదావరి మహాత్మ్యమును వచించినట్లు గలదు.

గోదావరికి వృద్ధగంగయనికూడ నామాంతరము గలదు. గోదావరి పుట్టుపూర్వోత్తరములఁదెలుపు గౌతమీ మాహాత్మ్యమునందు గూడ గోదావరియే మొదట భూలోకమునకు వచ్చెననియు, తదుపరి భగీరథునిచే గంగ ఉత్తరహిందూస్థానమునకుఁ దేబడెననియుఁగలదు. గోదావరీనదియే చాల ప్రాచీనమనుట కీపురాణము లీవిధముగఁజెప్పుటకు కొందఱు శాస్త్రజ్ఞులీ క్రిందికారణముఁ జెప్పుదురు. పూర్వము, ప్రస్తుతము ఉత్తర హిందూస్థానమునఁగల గంగాసింధు మైదాన ప్రదేశమొక సముద్రముగ నుండినది. అపుడు దక్షిణ హిందూదేశమొక పెద్దద్వీపముగనో, లేక ఇపుడు మునిఁగిపోయినదని తలఁపఁబడుచుండు నొక గొప్పభూఖండమునం దొక భాగముగనో యుండెను. ఆసముద్రము క్రమక్రమముగ భూమియైన తరువాతనే గంగానది యిప్పటిరూపము దాల్చినదని వచించుచున్నారు. కావుననే గోదావరి గంగకంటె ప్రాచీనమని పేర్కొనఁబడుచున్నది.

గోదావరికి గౌతమియనియు గోదావరియనియు నామములు గలుగుటకు గౌతమీ మహాత్మ్యమున నిట్లు జెప్పఁబడినది. పూర్వము ఈశ్వరుఁడు గంగను శిరమునఁదాల్చినప్పటి నుండియు నీశ్వరి యీసుగొని గంగ నా స్థానమునుండి తప్పింపఁదలంచెను. ఆమె గణనాథుని యీ కార్యము చేయుమనికోరెను. అతఁడు జయ సహాయుఁడై గౌతమ మహర్షివద్దకు "వృద్ధభూమిసురరూపముదాల్చి" వచ్చెను. ఆకాలమున గౌతముఁడు కఱవుచే బాధపడుచున్న 'నెల్లవారానులు ధరామర బాహుజ వైశ్య శూద్రు'లకు ఆశ్రయమిచ్చి పోషించుచుండెను. అకార్యమునకు భంగముగల్గింపఁ దలంచి గణనాథుఁడు "జయను వృద్ధగోరూపముగైకొని, మునికృషి దేశంబెల్లను, గాళ్ళ నరింపుచుఁ మెలఁగుమటన్న" "జయయొక వృద్ధధేనువయి సంయమినాథుకృషి ప్రదేశమంతయుఁ జరణప్రహారముల నాశము జేయుచు" చరింప "కన్గొని మేదినీసురాన్వయ తిలకుండు దాని తృణనాళము వైచి యదల్ప" నది "తృణమొక నారాచము దాకినవిధిఁ ధరాస్థలి" ద్రెళ్లెను.

అంత మునులెల్లరు గౌతముఁడు గోహంతయని గోలఁజేయ గణనాథునిచే ప్రబోధితుఁడై గౌతముఁ డీశ్వరునివద్దకుఁజని గంగనిమ్మని ప్రార్థించెను. "అప్పు డార్యాప్రబోధితుఁడై శివుండు, దివ్యగంగాంబసహితమై దేజరిల్లు జడయొకటియిడె మహికి జనుమువిప్ర తావకీన

యభీప్సితము ఫలించు''నని నాతఁడా జటను గొని గంగను బ్రార్థించి దన యాశ్రమము నకుఁ జనుదెంచి గోవునుగాంచి 'దివ్యశుచి జలంబులఁ దడిపిన గోవు సజీవయయ్యెను. మునులును సంతసించిరి. గంగానదియును తూర్పుముఖముగఁ బ్రవహించి సాగరునిఁ గల సెను. హరిహరులు దానితీరముల నెలకొనిరి, 'గౌతమునిపేర నదిగాంచె గౌతమీసమాఖ్య. గోదార్థమాగత మగుటఁజేసి యవని గోదా. వరీ సమాహ్వయ మశేషభావనము లెఱుంగ తాల్చె నప్పుణ్యతటిని.' ఈప్రక్కనగల త్రివర్ణచిత్రమీ గాథ నాధారముగ గావించు కొని చిత్రింపబడినది. గౌతముఁడు శివుని జటను బిండుచున్నట్లును, అందుండి గౌతమి యుద్భవించినట్లును మనోహరముగ చిత్రింపఁ బడినది.

అధునికు లీ పురాణగాథలను నమ్మినను నమ్మకున్నను అందలి పవిత్రోద్దేశమును మాత్రము గమనింపదగినది. కోట్లకొలఁది ప్రజలకు జీవనాధారమై యొప్పుచున్న యీ జీవనదికి కృతజ్ఞతఁ దెలుపుటకును, నదీతీర మనోహరదృశ్యములఁదిలకించి వాని కాధార భూతుఁడగు పరమాత్ముని పవిత్రోద్దేశములో స్మరించుటకును గోదావరికి మహాత్మ్యమును గల్పించి తత్తీరప్రదేశములందు దేవతాప్రతిష్ఠఁ గావించిరని యెంచవలసియున్నది. ఇవ్విధ మునఁ గావించినఁగాని, యజ్ఞానులగు జన సామాన్యము, ప్రకృతి సౌందర్యముగాని, పరమాత్ముని లీలలనుగాని గమనించుటకు వీలు గలుగదు.

---

## పారిజాతము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

గీ. దళములన్నియు ముడిచైచి దారినొసఁగ
లేని భ్రమరమ్మునకు బద్మ! దానఁజేటు
చూడ సుంతైనఁ గలుగదు; చూతవనులు
అంతటనుఁ బూచి రసవంతమగుచునుంట.

౨

జగతిలో భృంగ మీ పారిజాతసుమము
నెంతవరకును మెఱుఁగదో యంతదనుక
కుంజకుంజమ్మునన్ గల కుజముకుజము
నందు సంచారమొనరించు విందుఁగుడుచు.

# కళామహత్త్వము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్.

పలుకులకందని అద్భుతశక్తి మనుష్యహృదయమున నున్నది. సాధారణముగ మనుజుఁడు దీని నెఱుఁగనేయెఱుఁగఁడు. పావని ఆత్మశక్తి నెఱుఁగఁడందుము. మారుతియందే కాదు యీలోపము కొంతకాలము ప్రతి మానవునియందును గలదు.

మనుజునిచే నాత్మశక్తిని గుఱుతింపఁజేయుటకు జగదీశుఁడు వేయి వెరవులు రోయును. వనసౌందర్యము, మధురసౌరభము, మంజులరవము, మలయహిల్లోలము, కనులందు చిత్రదృశ్యములు తళ్కొత్తించు స్వర్ణకాంతి ఈశ్వరాశీస్సువలె గగనతలమునుండి యవిరళముగ వెడలు చంద్రికాధార ఈ వెరవులలోనిది. మానవహృదయము నివి సోకినంతన నందలిశక్తి పులకితమై తలయెత్తును.

పతిఁగూడి దివ్యపుష్పకమున నయోధ్యకు మరలిన వైదేహివలె, సౌదామినీ సంగినితో మేఘడోలికయం దూఁగాడు కవిమానసము మాడ్కి, పువ్వురొమ్మలోని అమృతసరమున నీఁదులాడు ద్విరేఫవల్లభునివడువున, పర్వతనిస్తబ్ధతయందు స్వాదుగీతికావీచిక లుప్పొంగించి నిజాత్మనందు జలకమాడించు పక్షి-పరమహంసపగిది, జాబిలి గిలిగింతలకు పరవశమై హృదయమువిప్పి "ప్రేమదాన"మని సౌరభపూరమును నిజేశున కర్ఘ్యమిచ్చు కుముద్వతీ సీమంతినిలీల, తలసూపిన మనుష్యశక్తి అనంతానందమున నుఱ్ఱూఁతలూఁగి వివిధకళలం దాత్మప్రకాశముఁ గావించుకొనును. కావుననే లలితకళలు కడలేనిహాయికి నిధానములై యుండును.

సుఖ మింద్రియములనుండి జనించులాగున ఆనందము ఆత్మనుండి ఉద్భవించును. దీని నాత్మహృదయములందు నింపుకొనినకళలు ఆధ్యాత్మికములనుట స్పష్టము.

కనువిందొనరించు దృశ్యమట్లు, కనదురు రూపుఁగల కళ ఆంతరంగికమైన ప్రతిభను లేపును. కళాహృదయము మహత్తరమైనదనుట, ఆనంద ప్లావితమైనదనుట నిక్కమే! కళాముఖము సౌందర్యసందీప్తమై, ప్రభాప్రదీప్తమై యుండుటయు నిక్కమే! కావున నది యెదుటిహృదయమున భావోద్రేకము గలిగించును.

కళలందు ప్రధానమైనది కవిత. సౌందర్యమాధుర్యసౌష్టవములను ముగురమ్మల నట్లాత్మహృది నిడికొని, యిది దివ్యరూపున శోభిలును. కావుననేకదా కవిశైలి కడుంగడు చక్కనై యుండును! చక్కనిబిడ్డని గర్భమందు గల త్రిలోకసుందరి సీతమ్మయేకదా వాల్మీకి హృదయమున మహాద్భుతవ్రాతభావములను లేపి,అతనిచే మహాకావ్యమును చెప్పించినది! భావభువనములను గర్భగోళమందిడికొని,సౌందర్యసంశోభితమైన,కవివాక్కు పఠితలయంతరంగములం దుత్తాలభావతరంగముల నుప్పొంగించును.

ఆత్మసముద్భవమై, దివ్యమై, దివ్యాంబరధారియైనభావమే బహుళకావ్యములకు కన్నతల్లియైనది. కావ్యసంతతి యుగయుగములందు వర్ధిల్లుచునేయుండును. ఆత్మ అమరత్వముఁ గలదగుటను, దానికడుపునఁ బుట్టినకళలును, కావ్యములును చావు నెఱుఁగనివై వర్ధిల్లుటం దక్కజమేమున్నది?

కన్నుగుట్టు దృశ్యములందే, హృదయశక్తిని మేలుకొలుపు తావులందే కళలును, కవితాలతలును పుష్పించి ఫలించినవికదా! మనుష్యపరిస్థితులందు పొడసూపు నేఁటి జఘన్యదృశ్యములంతరించి మధుమయ సౌందర్యయుత సౌష్టవసంపన్న దృశ్యములకు చోటొసఁగు ముహూర్తమున నాంతరంగికశక్తి పూర్వమెట్లు విజృంభించి, కళలనూలమున, జగతియం దద్భుతసృష్టిని గలిగించును. ఇట్టి సృష్టియందే సచ్చిదానందములు తోలు కాడును.

అంతరంగికశక్తినిలేపునవి ప్రకృతిచిత్రములే కావు. దురంతయాతనలు మనసులు మార్కొనుతఱి యందలిశక్తి నిదురనుండి మేల్కాంచి విజృంభించును. అపాయమందు బడియేగదా కురంగము జంఝామారుతోద్ధూతమగు దూదిపింజవలె నెగయును! అపాయము కట్టెదుటతోఁచినపుడు భయసంశయము లంతర్ధానమగును. భయసంశయము లవిద్యకుసంబంధించినవి. ఇవియే మనసునకు సహజముగాక దానినంటు 'నవసీతము'. ఇది యదృశ్యమైనంతన నీరద నిర్ముక్తనీరజాప్తునికై వడి సహజశక్తి, సహజసౌందర్యములతో దేజరిల్లుచు మనుష్యవాక్కునందును, మనుష్యకృత్యమందును, ఆత్మప్రకాశమునందును. కావుననే కళోపాసనము కలన వసుమతికి సేవచేయఁ జాలువ్యక్తులను వీరులను జగదీశుఁడు కడలేని కడగండ్లయందుఁ గూలఁద్రోయును. అభాగులవలె వీరత్తరియార్తనాదముఁజేయరు. నిరాశయందు రవులొక్కంటిమని గోతికప్పన మొనరింపరు. తమయిక్కట్టులు గంభీరభావభరితములనుటగుర్తించి, ధృతిసహితులై, జబ్బగొట్టు నరిష్టముల నెదుర్కొందురు. మేలుకాంచిన మహావీరుఁడు కోటిరక్కసుల నుక్కడించుటకై ముందుల కురుకునట్లు, నెదిటి సేనలను నురుముసేయుటకై యాంతరంగికశక్తి తన యద్భుతబలమును ప్రదర్శించును. శూరాగ్రేసరునిచే నద్భుతక్రియలను జేయించుశక్తియే కళోపాసకునిచేఁ గురుగంభీర రచనలను జనింపఁజేయును గానసీతఁడును నాతఁడును సైదోడులని తెలుపుచుండును. విషోరగము మహాళిపై చారుమాణిక్యము శోభిలు లీల ఆపదలపై యద్భుతభావమణికాంతులు నీ సైదోడులు కాంతురా?

హృదయశక్తియందేమి సహజగుణమందేమి స్త్రీలు పురుషులకంటె మిన్నలు. ఘనకార్యములను నెరపుటకును, అద్భుతరచనలను సృష్టించుటకును వీరు నడుముఁగట్టిరేని, వీరియందు నిహితమైనశక్తులు తప్పక తలలెత్తి వీరిచేతికి గెలుపుసిడెములు నందీయఁగలవు. నావాక్కు విశ్వసనీయమని సోదరీమణులు గుర్తింతురా?

# భారతస్త్రీ సంపూర్ణస్వేచ్ఛ నెప్పుడు బడయగలదు!

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

[ఈవ్యాసమున శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు ఒక ప్రబలసమస్యపై తమ యభిప్రాయముల వెల్లడించియున్నారు. ఇతర సోదరీమణు లీ సమస్యపైననే తమ యభిప్రాయముల వెల్లడింపదలంచుచో, క్లుప్తముగ వ్రాసి మా కార్యాలయమునకు మేనెల 15 వ తారీఖులోపల పంపినచో ప్రకటింపగలము. సం. గృ. ల.]

మధ్యమకాలమందువలె మనదేశములోని భారతాంగనలశక్తి యిప్పుడు క్షీణించియుండలేదు. ఇప్పుడు హిందూరమణులు పండితులాహా యనునట్లు గ్రంథరచనకు దొరకొని పెద్దపెద్దగ్రంథములు రచించుచున్నారు. అత్యద్భుతకృత్యములనొనర్చి తమతమ దేహబలములను బుద్ధిబలములను ప్రకటించుచున్నారు. పత్రికాసంపాదకులగుచున్నారు. సభాప్రతినిధురాండ్రగుచున్నారు. కష్టసాధ్యములగు పెద్దపెద్దపరీక్షల నిచ్చి కృతార్థురాండ్రగుచు పురుషులనుమించుచున్నారు. స్త్రీవిద్యాసంస్థలను ప్రశంసనీయముగ నడుపుచున్నారు. జిల్లాబోర్డు, మండలవిద్యాసంఘము మొదలగు ప్రజాహితసంస్థలందు సభికురాండ్రయి తమ సంఘాభివృద్ధిని వెల్లడించుచున్నారు. దేశమాతసౌఖ్యమునకై తమప్రాణములను తృణప్రాయముగజూచి, పురుషులకన్న ముందంజవైచి, మాతృభూమి పాదసన్నిధిని తమ చీమునెత్తురులను సమర్పించి మాతౄణము దీర్చుచున్నారు.

ఇవియన్నియు నారీజాతికంతయు సంతసకరమగు విషయములే. నిజమే! సంతోషవిషయమే. అయిన యీ విషయమునకే సంతోషమున పారవశ్యులము చెందవలసిన స్థితి యింకనురాలేదు. ఇంటితోడనే మనము తృప్తిబడసి యూరకుండవలసిన ప్రాప్తిగలుగలేదు. భారతరమణి యింకను పూర్వపుస్వేచ్ఛను బడయలేదు.

కారణము! పూర్వపు భారతమహిళలకుండెడి యోర్పు, ఐకమత్యము, వినయము, యిప్పటి భారతస్త్రీకి లేకుండుటయే.

అయినను అట్టివారుకూడ ప్రస్తుతము లేకుండపోలేదు. అట్లని ఖండితముగా జెప్పలేము. ఏలన, అట్టివారు కోటికొక్కరైన నుండుటవలననే భారతమాత దైన్యముతో క్రుంగిపోయినను, కడప్రాణమైయున్నది.

ఇప్పటి నారీరత్నములలో ముప్పాళ్ళు, విద్యనభ్యసించినంతనే గర్వమును, దురహంకారమును పెరిగి — మానమే భూషణముగాగలిగి, పాతివ్రత్యమే పరమధర్మముగా నెంచు, భారతాంగన — పాశ్చాత్యాంగనల నవనాగరికతనుజూచి భ్రాంతిచెంది వారి నడవడులకు పారవశ్యులై, తమపాలిటి భాగ్యదేవతయగు పాతివ్రత్యమును, తమపాలిటి దరిద్రదేవతగా నెంచుచున్నారు. కటా! యెంత శోచనీయకరమగు విషయము! నోరెరుగని జీవులగు పశుపక్ష్యాదులు సహితము తమస్వబుద్ధిపై నాధారపడి తమకులధర్మమునను సరించుచున్నప్పుడు, జ్ఞానులుగను, ఆది జన్ములుగను తలచెడి మానవులే, పరులబుద్ధిపై నాధారపడి తమతమ స్వధర్మమునుమరచి తోడిమానవులగాంచి పారవశ్యము చెందుటయా! హిందూసుందరి, ఆంగ్లసుదతి నడవడిజూచి తన్మయురాలగుటయా? తన స్వధర్మమును మరచుటయా!

అంతకన్న హిందూనారి వారి వేషభాషల ననుకరించుటకంటె, వారిసుగుణముల కరగత మొనర్చుకొనిన నెంతయోలాభము. వారియందు ఐకమత్యమే వారి నింతవారినిగ జేసెననవచ్చును. భారతాంగనలలో నైకమత్యము సున్న. కాన వారియందుగల నీ సద్గుణముల నలవరచికొని, తమకు స్వాభావికములగు దయాదాక్షిణ్యాద్యుత్తమగుణంబులకు మరింత వన్నెబెట్టుటెంతయు సమంజసము.

పూర్వపుస్త్రీలు, విద్యవలన తెలివినార్జించి తమ సంసారము నశేయముగ నడపించుచు తాలిమి, ఐకమత్యము, గలిగి యర్ధాంగి యనిపించుకొని, సంపూర్ణస్వేచ్ఛను గలిగియుండెడివారు. ఇప్పటి ఆంధ్రమహిళలు విద్యరాగనే తెలివినిగోల్పోవుచున్నారు. ఆదినుండి శమదమాది సకలసద్గుణముల కునికిపట్టని పేరు గాంచిన భారతరమణులు ప్రస్తుతము రేమియు నెరుగని మూర్ఖాంగనలబోలె, నిరాడంబరత మొదలగు సద్గుణములు గిట్టక, వేషభాషలలో నేమి, మాటలలో నేమి, పైపై మెరుగులతో డాబులు గ్రక్కుచుందురు. మాతృభాష నేవగించి పరభాషకై ప్రాకులాడుదురు. "యే రాయియైననేమి? పండ్లూడగొట్టుకొనుట" కన్నట్లు, యే భాషయైననేమి! జ్ఞానలాభము బడయుటకు! అస్లైని తమ షోకులేగాని, ఇంటిశుభ్రతకై పాటుపడరు. ఇంటిపని నంతను యే వంటలక్కయైననో విడిచి చాని దుబారాఖర్చులను గమనింపక, భర్త విసిగికొనుచుండ, స్వర్గతుల్యముగ జేసికొనవలసిన సంసారమును, నరకప్రాయముగ నొనర్చుకొనుచున్నారు. విద్య నేర్చినకొలది వినయాదిసద్గుణములు హెచ్చువనియుండ, యివియేమిటీ తల్లక్రిందులు? తామే యిట్లున్న తమపిల్ల లెట్లు దేశసౌభాగ్యమునకు కారకులగుదురు! శివాజీ, నెపోలియనుబోనపార్టు మొదలగు వీరాధివీరులు, దేశసౌభాగ్యమునకు కారకులై చిరతరకీర్తి నార్జించుటకు కారణము వారివారి మాతలేగదా!

మరియు, స్త్రీయనిన సామాన్యశక్తిగాదు. పురుషుడుపుట్టిన దాదిగిట్టువరకు స్త్రీమధ్య నేయున్నాడు. మోక్షకాంత స్త్రీయేగదా! మాయాదేవి స్త్రీరూపయేగదా! విద్యాదేవతవాణి నారీరూపగదా! అఖిలభాగ్యదేవత స్త్రీరూపమున లక్ష్మియను పేర ప్రకాశించుచున్నదిగదా! అఖిలజనులకు జన్మదాత్రియగు భూమి "భారతమాత" యను పేర నారీరూపముననే గదా యున్నది. స్త్రీ యిట్టిదిగదా! అట్టి స్త్రీ తగు నేర్పుతో దిద్దికొనుచు భర్తయెడను, పిల్లలగూర్చియు, తనయందును, ఆరోగ్యవిధులను ననుసరించుచు, కలిమి, లేములయం దొక్కవిధముననే సంచరించుచు, ఐకమత్యము యోర్పు, వినయము, మొదలగు సద్గుణములు గలిగియుండుటయే స్త్రీకి విహితకృత్యము.

అట్లుండవలసిన స్త్రీ నారీజాతి కుండవలసిన సహనశక్తిని గోల్పోయి విద్యాధికుల మైతిమని గర్వములో సంసారబాధ్యత వహింపకుండుటచేతనే, పురుషులు, స్త్రీలకు నిర్భయముగా సంపూర్ణస్వేచ్ఛ నధీనము గావింప భయపడుచున్నారు.

కావున భారతస్త్రీల కిప్పుడు సంపూర్ణస్వేచ్ఛాశక్తి యలవడునవగ, యేనాడు భారతస్త్రీ విద్యావతియయ్యును గర్వమెరుంగక సహనాది సద్గుణమునుగలదై యుండునో, యేదినమున భారతనారి ఐకమత్యముగలిగి పరస్త్రీపురుషుల నిజసోదరీసోదరులుగ భావించి సమిష్టికుటుంబమునం దాదరభావము వహించునో, యేనాడు భారతాంగన, నిరాడంబర జీవనముగలదై యుండునో, యేదినమున హిందూరమణి, వినయశీలైకమత్యములుగల్గి సీతా, సావిత్రుల భాతినడచుకొనునో, ఆనాడే, ఆ దినముననే భారతనారి పూర్వపుస్వేచ్ఛ పూర్వపుగౌరవము బడయగలదు.

కావున యిప్పటి స్త్రీలోకము విద్యాధికులైనంత మాత్రముననే పూర్వపుస్వేచ్ఛను బడసితిమని గర్వింపక పైజెప్పిన, సహన శీలైకమత్యములుగలిగి పూర్వపుస్వేచ్ఛను బడయుదురుగాక! భారతరమణి తనయస్థానగౌరవము దాల్చుకొనుగాక!

# శిశుశిక్షణము

బుర్రా వెంకటనాంచారయ్య, ఎం. ఏ.

## పసిబిడ్డ—ఆట

ఆట బిడ్డని శ్రమశిక్షయందు బెట్టుననుట నిర్వివాదాంశము. వారు మనెడి ప్రపంచము నందలి రహస్యములన్నిటిని యాటయే బిడ్డలకు వ్యక్తపరచును. తమపితరులయొక్కయు పరిసరములందు వసించెడి యితర మానవుల యొక్కయు దైనికజీవనము ననుకరించియే బిడ్డలు ఆటలాడుచుందురు. పరిసరములు నీతిబాహ్యతకు పేర్గాంచినచో బిడ్డ దుస్స్వభావమును బడయును. సంసర్గమువలన దోషగుణములు గలుగుట సహజమేగదా! బిడ్డల కీరీతిగా సంక్రమించిన దురభ్యాసములను వారు వయోవృద్ధులయ్యును వీడలేరు. దీని మహిమను యాధునిక కిండర్గార్టెనర్లు (Kindergartners) బాగుగా నవగత మొనరించుకొనిరి గనుకనే పాఠశాలలందు బిడ్డలాడుకొనుటకు తగిన సాధన సామగ్రి నంతయు సేకరించి వారలక్రీడాపరాయణత్వమునకు దోహదమొసంగుట. అయినను భారతదేశమందు విద్యాలయము అట్టి సామగ్రిని యుచితరీతి నుపయోగపరచుట లేదనుట ప్రమాదముగానేరదు. నిజగృహములందు బొమ్మలపెండ్లిండ్లు మొదలైనవిచేయ నిచ్ఛగించు బుడుతలకు తగుసామగ్రినొసంగ తల్లిదండ్రులు వెనుకంజ వేయరాదు. అటులనాటలు మరుగుటవలన బిడ్డలు తమ పితరులాచరించెడి యవినీతికరములగు కృత్యముల శ్రద్ధతో పరిశీలించుట కవకాశములేక యట్టి దురభ్యాసముల నలవరచుకొనకుందురు గదా!

బిడ్డలు సామాన్యముగా నీళ్లనినచో పడిచత్తురు. దానికి కారణమేమో మీర లూహించితిరా? మన యనాదిపురుషుఁడు వేలకొలఁది వత్సరములక్రిందట జలముచే నావరింపఁబడెనుగదా! అపుడాతనికి జలమునెడ చెలిమిగలిగినది. అట్టిమైత్రినే శిశువు గూడ ననువృత్తసిద్ధాన్తము ననుసరించి యుదకమునకుఁ జూపుచున్నాడు. కొందఱు శిశువు లశుద్ధము పిసుకుచున్నారు. వారట్టి దురభ్యాసమునకు లోనుగాకుండునట్లుండ వలెననినచో పితరులు కొంత బంకమట్టిని పాకముచేసి దానిలో కొంచెము పసుపు వైచి దానిదగ్గర బిడ్డను విడచుట శ్రేయోదాయకము. ఇందువలన బిడ్డ డశుద్ధము జోలికిపోడు; బంకమట్టితోడనే దేవులాడును; దుర్గంధపు బాధయు నుండదు.

తన బంధువులయందలి యనురాగము నికముందు గనుపరచునను సూచనయే తాను సాలభంజికములం దమితాదరము శిశువు గనుపరచుట యగును. పాఠశాలలందు శ్రద్ధతో శిశువయస్సును పురస్కరించుకొని వారివారికి తగు ఆటలందు బిడ్డలను దింపుట

యుత్తమము. బిడ్డలు ప్రథమమున కాగితపు చొక్కాయిలు, లాగులు బొమ్మలకు చేయుట నేర్చుకొనిన పిమ్మట గుడ్డకత్తిరించి లాగుట మొదలయినవి తమయాట బొమ్మలకు నేర్పుట యుపాధ్యాయాదులు నేర్పుట మంచిది. అటుపిమ్మట బొమ్మరిండ్లు నిర్మించు పెట్టులనో బుడుతలకు చూపవలెను. తరువాత బొమ్మలకు గుండీలుపెట్టుట మొదలగు కార్యములందు వారలను సమర్థులనుగాఁ జేయవలెను. మన తెలుఁగుబిడ్డలు తాటికాయ డొక్కలతో బండ్లుకట్టి వానిని లాగుటయు నాటయే; అదియును పరిసరముల ననుసరించుటయేగదా! రుక్మిణీదేవి "పేర్వేరబొమ్మల పెండ్లిండ్లుజేయుచు యాబలలతోడ వియ్యంబులందు"టయును పరిసరముల ప్రోద్బలమువలననే. నేటి జనపదములందలి బాలికలు వెలగడొక్కలందు చింతగుల్లలందు నన్నమువండుటయు నందులకే. ఇట్టి కృత్యముల వారి కలవరచుటవలన భావిజీవితమునందు తమకు కావలసిన యలంకరణాదులను వారలే వేసికొనగలుగుదురు. ఇటులనే క్రమముగా భవిష్యజీవనమునందు తామెదుర్కొనవలసిన ఘట్టముల సోపానముల నర్భకు లెక్కుచుందురు.

ఆడుపిల్లలయాట లెవ్వియో మగబిడ్డలయాట లెవ్వియో మొదట శిశువులెఱుఁగరు. పితరులుకాలక్రమమున నెవ్వరియాటలయందు వారి కభిరుచి గలుగునటులఁ జేయుట మంచిది. నేను మంత్రిని నేను రాజునని పిల్లలాడుదురు. ఇదియు ననుకరణమేయగును.

## ఆట—దాని నిర్వచనము

శరీరమునందలి యధికశక్తిని పలుతెఱఁగుల వ్యక్తపరచుటయేయాట. ఇది బిడ్డనికి సహజము. మృగశాబకములు సహితము చెలగాటమాడుటలేదా! ఈ చెలగాటమే పోనుపోను అట్టి జంతువుల కాహారసంపాదనమునకును శత్రువులనుండి తప్పించుకొనుటకును వివిధశక్తులను ప్రసాదించును. అక్కరయు నాటయును; ఈ రెండు మాత్రమే శిశువును వస్తుతత్వము నెఱుంగునట్లొనరించుచున్నవి. కనుక యాహారాదులు సేకరింప నగత్యములేని కుటుంబములందు జనించిన బిడ్డలకు ప్రపంచజ్ఞానము శూన్యమగును. అట్టివారికి ఆటయే శరణ్యము.

కొందరు శాస్త్రజ్ఞులు,బిడ్డలు విశ్రాంతియునుల్లాసమునుకాంక్షించియే ఆటయందాశక్తి గనుపరతురని నుడివిరి. ఇది పొరబాటు. వీరు నిజమైన విశ్రాంతినే గోరినట్లయిన నిద్రాసుఖమినుమంత కాలమనుభవించి మేల్కాంచి మఱల జాగ్రత్ప్రపంచమున చురుకుదనముతో ప్రవర్తించియే యుండరు గదా!

వృత్తిరాహిత్యమువలన బిడ్డలు తమ శక్తిని వినియోగపరచుటకు దారియు తెన్నునుగానక బాలక్రీడలందు సంలగ్నమానసులగుచుండిరని కొందఱియూహ. అట్లయినచో వారు బుద్ధిపూర్వకముగా కాంక్షించెడిపనియందు (ఆటయందు)గూడ విరక్తతగలిగి అలసిపొలసి తోటకూరకాడవలె వేలగల పడుటలేదా! ఆటయు నొకవిధమగు వ్యాపారమేయగును. మనవారు

"చిన్నచిన్నచేతుల యీచెంబు అటుపెట్టు చూదా" మని పసిబిడ్డలయాటనుగూడ సాధ్యమయినంతవఱకు నిర్దిష్టకృత్యములకే వినియోగపరచుచుండిరి గదా! అది మంచిదే.

పరిణామవాదులు కొందఱు బిడ్డలాడు నపుడు తమతమ పూర్వీకుల వృత్తుల నభ్యసింతురని వాదించుచుండిరి. కాని పసిగందులు పరిసరముల ననుకరించుటయే పరిణామవాదులటు లపార్థముల గల్పించి సమర్థించుచుండిరనుట సమంజసమగునేమో.

పూర్వీకులవలె మెలఁగుటవలన బిడ్డలు తమ భావిజీవితమునం దుపకరించెడి విషయముల గ్రహింపఁ గలుగుదురనియు, చిన్నపుడు కయ్యమునకు కాలుద్రవ్వు స్వభావము గల బిడ్డలు పెద్దవారయిన తర్వాత పరమ సాధులగుట లేదాయనియు పై వారిమతము. కాని ఆటయే వారిని నాగరికులనుగా తయారుజేయుననుట విశ్వసింపదగదు. సద్విద్యయు శిక్షాస్మృతియును మాత్రమే వారల సాధులనుగాజేయునని మనమెందులకు తలంపరాదు.

ఆట శిశువులకు తమభావి జీవనమున నమిత ప్రయోజనకరములగు శక్తులను ప్రసాదించుననుట అత్యుక్తియగును. బాల్యక్రీడలు వారికి పెద్దవారి వృత్తులయం దభిరుచులను మాత్రమే కల్పించునుగాని తన్నిర్వహణమునందు వారికి చేఁదోడు వాదోడు కానేరవు. కాని మార్జారశాబకము మొదలగు మెకములకాట యతీతమగు సహాయకారియే యగును. అదియే వానికి తమ యాహారాదుల నెటుల సంపాదించుకొనవలయునో నేర్పును. అదియే బిడ్డని జ్ఞానేంద్రియముల గూడ సంస్కరించుచున్నది.

బిడ్డలు తమ యిష్టమువచ్చినటుల మెలంగుటయే యాటయగునుగాని నిర్దిష్టఫలితమును బడయుటకు జేయునదంతయు పనియే గాని యాట కానేరదు. పనిని శరీరమునందలి ప్రత్యేకావయవముల పలుమారు లుపయోగించి యలఁతఁజెందునటులఁ జేయుచుంటిమి. కాని యాటలాడునపుడు మాత్రమట్టియవయవముల వెంటవెంటనే మార్చుచుందుము.

ఆట శిశువునకు సహజధర్మమైనను ప్రత్యేక కృత్యముల నాచరించు టెటులనో యాతఁడెఱుంగవలెను. బిడ్డలాటలాడునపుడు నిబంధనలసరకుజేయరు. అట్టి తరుణమున వారికి తగినంత స్వేచ్ఛనొసంగుట మంచిది. పంచవత్సరములవఱకును బిడ్డడాటలేగితనముగా నుండును. 5 మొదలు పది సంవత్సరములవఱకును Games అన వానికిష్టము. ద్వాదశవత్సరములకు పైన Games ను Sports ను కలగలుపు జెందును. వయస్సుముదిరినకొలఁదియు నాటగాడు తన స్వేచ్ఛను గోల్పోయి నిబంధనలకు దాసుఁడగును. ఆటయును, పారితోషికాదులబడయుట కాదునపుడుగాని నిర్బంధ విధానమున నాడునపుడుగాని పనిగానే

పరిగణింపఁబడును. క్రీడాంగణమునందే బిడ్డడు ధర్మశాస్త్ర ప్రయోజనమును గుర్తించును.

నాల్గవమాసముననే బిడ్డడాట మొదలిడును. 2 లేక 3 సంవత్సరముల వఱకును బిడ్డనికాట శారీరము జ్ఞానసంబంధమునగు నభివృద్ధినొసంగును. ఈ కాలముననే శిశువ మితముగా నభివృద్ధిగాంచును.

బిడ్డ మూడవసంవత్సరమున తనపరిసరముల ననుకరింప ప్రారంభించును. శబ్దజాలమును పదేపదే యుచ్చరించును. వాని హావభావముల బహువిధముల వ్యక్తపరచ మొదలిడును. భావనాప్రపంచము బహుళమగును. ఈభావన 5, 6 సంవత్సరములు పైఁబడగనే యుత్కృష్టతను గాంచునుగాని యిది ప్రాయమువచ్చు వఱకును క్రమక్రమముగా కృశించుచుండును.

ఆటయందు శిశువు తన మూడవవత్సరమున జిజ్ఞాస బాగుగా వ్యక్తపరచుచు మిగుల నుద్రిక్తుడగును. 7 మొదలు 12 వఱకును బిడ్డలాటయందహమహమిక కనుపరతురు.

ప్రకృతిలో నణగిమణగిపోవు బిడ్డలు తల్లితండ్రులెంత యానిపెట్టినను వారి పరోక్షమున హానికరములగు వస్తువులను తాకి వాని నిజస్థితిని గ్రహింపఁగలుగుచుండిరి. విద్యావిషయకములగు నాటల బిడ్డల కేర్పాటుచేయునపు డుపాధ్యాయులు వారి కండరములకు, భావనాశక్తులకుధారణాశక్తికి శబలతనిచ్చువానిని మనస్సునందుంచుకొనుటమేలు. ఉచితములని మనకు తోచిన సలహాలనిచ్చుట మంచిది గాని, యీయాట మంచిది యాయాట మంచిది కాదని శిశువులను విమర్శించి నిరుత్సాహులనుగాఁ జేయరాదు. కొన్ని కథలను వారిచేత నాటకము లాడించుటయు మంచిదే. వారి యాటవస్తువులను గురించిన కథలను చెప్పుట మంచిది.

14 సం॥ల బిడ్డలకు సమిష్టిక్రీడలయందిష్టము. అట్టిక్రీడలవలన వారి నడవడిగూడ విశేషముగా చక్కఁబడును. మనయాంధ్రదేశమునందు బిడ్డలాడుకొనెడియాట లెన్నియోగలవు. వానినిగూర్చి పత్రికాంతరములిదివఱకే వివరములు ప్రకటించి నాభారమును తగ్గించినవి. బాలురయు బాలికలయు నాటలను విస్పష్టముగా తెలిసికొని వారి వారి వయస్సునకుతగిన యాటపాటలతో ప్రొద్దుబుచ్చునటుల తల్లిదండ్రులు జూతురని నాకోరిక.



కొచ్చిన్ మహారాజావారు మద్రాసు సేవాసదనము హైస్కూలు సందర్శించి
నప్పుడు తీసిన ఛాయాచిత్రము (ఫిబ్రవరి 1936)



"కాటుక కంటినీరు........................భారతీ!"

# WHAT LODHRA IS AND WHAT IT IS FOR



## లోధ్ర

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు

ఈ ఔషధరాజము సుప్రసిద్ధ వనఓషధులచే తయారు చేయబడినది. గడచిన ముప్పది ఆరు సంవత్సరములనుండి హిందూదేశమునందేగాక పరదేశములందుగూడ వాడబడి ప్రసిద్ధిగాంచిన దివ్యౌషధము.

## లోధ్ర

ఋతుదోషాది దోషములకు వజ్రాయుధము

ఈ లోధ్రను వాడినవారు యిది వనితలకు వరప్రసాదమనిన్ని, రసాయనములకు రాణియనిన్ని, కొంగు బంగారమనిన్ని మరియు ననేకవిధములుగ స్తోత్రమును చేయుచుండుట యెల్లరకు దెలిసిన విషయమైయున్నది.

12 ఔ. రు. 3 _ 6 ఔ. రు. 1-10-0

# సరుగుడుతోపులో.........

గొల్లపూడి జోగారావుగారు

నా కప్పటికి యిరువదినాలుగు. ఆనందమయ జీవితద్వారమున అడుగిడిన నన్ను అంతులేని యీ దుఃఖప్రపంచమునకు గిరవాటు వైచినది విధి. అనంతమైన యీ విశ్వంలో నేనుతప్ప నా అని చెప్పుకోడానికి నాకు యెవరూ లేరు. నేను యేకాకిని కావుననే నిస్సారమైన సంసారమోహమునబడి కొట్లాడు నాతోడివారలు నాకు హాస్యాస్పదులయ్యేరు. వారి జీవనప్రవృత్తికి అసహ్యించుకొనేవాణ్ణి. స్వార్థరహితమయిన ప్రకృతియే నాకు ఆనందదాయిని అయింది. అంతేకాదు. విధియొక్క నిరంకుశ శాసనమునకు లొంగి నిరాధారమై యీ విశ్వంలో కొట్లాడు నావంటి కష్టజీవికి అమృతమయమైన తన అద్భుత గానంలో లీనమొనర్చి లాలించి ఆనందమొనగూర్చ జాలునది వొక్క ప్రకృతియే గదా!

నా నిత్యజీవనమునకు నే జేయవలసిన కార్యము నిర్వర్తించుకొని మావూరికి చివర్నున్న సరుగుడు తోపు కేసిపోయేవాణ్ణి అనుదినమూ. సముద్రములోకి పోయే గడ్డప్రక్కగా యిసికలో కూర్చొని ఆ ప్రకృతిలో లీనమయ్యేవాణ్ణి. ఫర్లాంగుదూరంలో సముద్రఘోష శ్రావ్యంగా వినబడేది. తోపులోంచి పడమట వలముకొన్న సంధ్యారాగము...... అందులోంచి రొదగసిపొయ్యే పిట్టల కూజితముల్లో నా జీవితవ్యథ మరచేవాణ్ణి. ఆ ప్రశాంతములో శుక్లపక్ష యామినులలో ప్రకృతి జోకొడుతోంటే యీ యిసికలోనే పరుండి అనిర్వాచ్యమైన వొక అపూర్వానందమును పొందేవాణ్ణి. ఎదురుగావున్న అంతులేని జలభాగాన్ని పరికిస్తూ నిలువున పొంగి క్రుంగిపొయ్యే కెరటములో నిగూఢమైన ఆ లీలామూర్తి శక్తికి విస్మయమందేవాణ్ణి. నా అల్పత్వమును గ్రహించి ఆ దివ్యమూర్తిని ధ్యానించేవాణ్ణి యెంతో సేపు...............

ఇలా నా సాయంత్రపు స్వేచ్ఛావిహారముల్లో కాలచక్రము యెంత తిరిగిపోయిందో నాకు తెలీదు. నాడు పడమట సంధ్యారాగము అప్పుడే అంతరించిపోతోంది. అంబరతలాన్ని అయిదారు చుక్కలు మెరుస్తున్నాయి. సంధ్యావాయువులో పొడుగ్గా పెరిగిన సరుగుడుకొమ్మలు వూగాడుచు యేదో వొక అపూర్వమైన గాన మొనరుస్తోన్నాయి. ఆ వాతావరణములో మైమరచి యిసికలోనే పరున్నా. తోపులో వింతవింతగా అరుస్తోన్న పిట్టల కూజితముల్లో స్పష్టమై 'లిల్లీ' అను వొకపిలుపు వినబడ్డాది. ఆ సరుగుడుతోపు కేసిచూచేను. ఆశాపులకితమ్ములయిన నాకనుల కగబడిన దేదీ లేదు. అయిదు నిముషములు గడచేయి. 'శైలా' అను కేక తోపులో మారుమ్రోగింది. అది యిందాకటి గొంతుక కాదు. లేచి తోపుకేసి వెళ్లాను. ఇనపతివ్వతో చాలవరకు ఫెన్సింగు అడవితీగెలతో అల్లివుంది. గేటుదాటి లోన ప్రవేశించాను. బంగళాకి ముందుగా అల్లిన రాధామనోహరందగ్గర చక్కని కుక్కతో పెనగులాడుతో వొక యువతివుంది. ఆ అస్పష్టసంధ్యాలోకంలో ఆమె అపూర్వతరుణీమూర్తి. ఆమె నిలువున లేచినించుని తటాలున నా కేసిచూచింది. నా రక్తనాళముల్లో యేదో ప్రవహించినట్లయింది. ఆమె వెనుదిరిగి కుక్కతోసహా బంగళాకి ప్రక్కగా వెనుకకు వెళ్లిపోయింది. నే నక్కడ యెంతోసేపు నిలబడలేదు. దారిలోమాత్రం యింతకాలము నాకు కనబడని ఆ బంగళా దానిలోని మనుజుల విషయమై తలచినపుడు కొంత విస్మయము కలుగకపోలేదు.

మరి మూడురోజులు ఆ అమ్మాయి జాడలేదు. నాటి సాయంత్రము నా మామూలుప్రదేశాన్ని వదలి గెడ్డలోకిపోయాను. సన్నని నీటిపాయ వోవారగా ప్రవహిస్తోంది. అస్తంగతసూర్యకిరణము లా ప్రదేశముపైబడి అపూర్వంగా ప్రతిబింబిస్తోన్నాయి. గెడ్డలోంచి ఆమె ఆరేళ్ల అబ్బాయిని వెంటబెట్టుకొని మెల్లగా నడచివస్తోంది. ఆమె ధరించిన తెలి వస్త్రము ఆమె శరీరమునకు శోభ గూరుస్తోంది. ఆ అబ్బాయి ఆమెతో యేదో మాట్లాడుతున్నాడు. ఆమె నన్ను చూచింది. గెడ్డలోంచి రోడ్డుపైకి పోవటానికి ప్రయత్నిస్తోం దామె. ఆ అబ్బాయికూడ చూచేడు.

'అబ్బాయి! యిలారా!'

అత డామె ముఖంలోకి చూచేడు.

'ఇలారా!'.........తిరిగీ పిలచేను.

'వెళ్లు'.

మెల్లగా అడుగువేసుకుంటూ ఆ అబ్బాయి నా దగ్గరకు వచ్చేడు.

'నీ పేరేమిటి?'

'మాస్టరు క్రేసీ!'

నేను కన్నెత్తి చూచేను. ఆమె నిశ్చలంగావుంది.

'మీ నాన్నగా రేమిచేస్తున్నారు?'

'ఇంజనీయరు.'

'అలాగా! ఇప్ప డిలా యెక్కడికి వెళ్తావు?'

'షికారు.'

ఆ అబ్బాయి స్పష్టమైన ఉచ్చారణకు నేను ఆశ్చర్యపోయాను.

'ఆమె యెవరు?'

'మా దాది.'

ఆమె చలించినది. బుగ్గలు యెర్రబారినై. గెడ్డలో వోపక్షి యెగిరిపోతూ వింతగా అరచింది. దూరాన్ని సముద్రపుఘోష స్పష్టంగా వినబడుతోంది.

'వెళ్లిపోదాం రా!'......ఆమె పిలచింది.

క్రేసీ నాపట్టు విడిపించుకున్నాడు.

'పోతాను.'

అత డామెదగ్గరకు పోయాడు. ఆమె రోడ్డు మీదకి పోయింది. ఆమె వెళ్లిపోయేవరకు నా కామె సౌందర్యము మనసులో తట్టనేలేదు. నేను 'గబగబ' రోడ్డుపైకి వచ్చేను. ఆమె తోపులోకి వెళ్లిపోతూ నాకేసి చూచింది. ఇసికలోకి పోయాను. ఆలోచన్లో యెంతసే పలా పరున్నానో రోడ్డుమీద పోతూన్న వో కారు శబ్దంవిని లేచాను. ఆ ప్రదేశమంతా చల్లనివెన్నెలలో నిండివుంది. రోడ్డుమీద పోతూన్నపుడు మాత్రం నా చూపులు సరుగుడు తోపులోని బంగళా కేసి పరిగెత్తాయి వోసారి.

ఆ మరునాటినుంచీ లైలా (అది ఆమె పేరు) ప్రతిదినమూ క్రేసీని తీసుకొని గెడ్డలోకి వస్తోండేది. కాని ఆమెతో పరిచయము నాకు రోజుకోజూ క్రొత్తగానేవుండేది. లైలా మాత్రం నాతో మాట్లాడేందుకు జంకేదికాదు. క్రేసీ చాలా పేరుమోసిన యింజనీయరని యిక్కడ 'వాటరు వర్క్సు' సరి చూడ్డానికి ప్రభుత్వమువారు నియమించగా వచ్చేరనీ చెప్పింది. అతని భార్యా రాధాభాయికి ఆమెను చూస్తే యెంతో దయని చెప్పింది. చిన్నక్రేసీ ఆమెను విడిచి నొక్కగడీ వుండడుట. ఇలా యెన్నోవిషయాలు ఆమె వింతగా చెపుతోండేది. లిల్లీకి ఆమెకు వున్న పరిచయము వోనాడు యెంతో చమత్కారంగా వర్ణించింది.........ఆమె అలా చెపుతూంటే ఆ చిన్ననోరు, చక్కని పెదవులు, తీర్చిన కనుబొమలు, ప్రేమతో మెఱసిపొయ్యే కనులు చూస్తో అలా వుండిపోయేవాడ్ని. ఆమె నాలోకి చూచి చలించేది. నా అవివేకానికి నాలోనే సిగ్గుజెందేవాడ్ని. కాని ఆమె చక్కనిముఖం నా హృదయంలో చిత్రింపబడ్డాది. ఆమె ముఖంలో ప్రస్ఫుటించే విషాదరేఖకూడ నా మనసులో నాటుకుంది. ఆమె యీ దాదిత్వమున కెలా వొప్పుకుంది. ఆమెకు యీ

ప్రపంచములో బంధువులే లేరా? ఈ రాధాబాయమ్మ ఆమె కేమి కావలయును? ఆమె జీవితములో యేదో రహస్యముందని గ్రహించేను. నావలె ఆమెదికూడ భగ్నజీవితమేమో అని తలచినపుడు మాత్రం నా హృదయం సంక్షోభించేది—నా శరీరము వణకేది.........

నాడు రొనిమిదిగంట లయింది. చంద్రకిరణములు సముద్రజలముపైపడి అపూర్వంగా ప్రతిబింబిస్తోన్నాయి. బాట బడిపోయే వొకటి రెండు కార్ల శబ్దం అప్పుడప్పుడు వినబడుతోంది. దూరాన్ని జాలరిగుడిసెల్లో పాడేపదము అస్పష్టంగా వినబడుతోంది. శైలా లిల్లీని వెంటబెట్టుకొని నీటిదగ్గరనుంచి వొకర్తే వస్తోంది.

'శైలా!'

ఆమె మెల్లగావచ్చి యిసికలో కూర్చుంది. లిల్లీ ఆమె వొడిలో కెక్కి నా ముఖంలోకి చూస్తోంది.

'నీ జీవితముగూర్చి నా కేమీ తెలియదు.'

శైలా నిశ్చలంగా కూర్చుంది.

'తెలిసికోవాలని అభిలషిస్తోన్నాను.'

'నాజీవిత మెవరికిని ఆనందము గూర్పజాలదు.'

ఆ నిండువెన్నెల్లో శైలా వో దేవతాస్త్రీకి మల్లే అగుపడింది. ఆమె విశాలనేత్రాల్లో అపూర్వమైన కాంతి ప్రకాశించింది. నాలో జయించరాని వొకానొక కోర్కె ఆమె శరీరమును తాకి, ఆమెను దగ్గరగా జేర్చుకొని, బుజ్జగించుమని ప్రేరేపించింది నన్ను. కాని ఆమె నిశ్చలత్వము?

అయినా నేను జరిగేను. ఆమె మొగముపై మొగముంచి 'భయములేదు. నీ జీవితరహస్యమును నాకు చెప్పు' అని అడుగుదామనుకున్నాను. అంతలోనే ఆమె

'నా జీవితచరిత్రను మీకు చెప్పుట కెట్టి అభ్యంతరము లేదు. కాని యిప్పుడు చెప్పలేను.'

ఆమె వొడిలోనున్న లిల్లీని నిమిరేను.

'లిల్లీ చాల అందమైనది.'

'అవును.'

'అది చాల విశ్వాసమైనదని కదూ చెప్పావు!'

'............'

శైలా లేచింది.

'నేను వెళ్లిపోవాలి.'

నేనుకూడ లేచాను. సరుగుడుతోపువరకు మే మిరువురు మాట్లాడలేదు. ఆమె గేటుదరి ఆగింది. వెళ్లిపోతానని తల వాడించింది. ఆమె కనుల్లో మాత్రం అపూర్వమైన వొకజ్యోతి ప్రకాశించింది.

మరి కొంతకాలమువరకు శైలా నా ప్రత్యక్షంలోకి రాలేదు. మాలితో వివాదపడుతోన్నప్పటి ఆమె గొంతుక విన్నాను. ఆతృతతో కర్రమెట్లు దిగివస్తోన్న ఆమె మూర్తిని చూచేను. తర్వాత ఆమె జాడలేదు. ఆనాడు సరుగుడు తోపుకేసి శూన్యంగా చూస్తున్నాను. తోపులోంచి పడమట శుక్రుడు ప్రకాశిస్తున్నాడు. లిల్లీ నాకేసి పరుగెత్తుకొస్తూంది. అది నన్నుచూచి మళ్లా తోపుకేసి పరుగెడుతోంది. నే నలాగే కూర్చున్నాను. అది వెనుదిరిగి నాముందు అరుస్తో తోపుకేసి పరుగెడుతోంది. నేను లేచాను. దానివెంటనే తోపులోకిపోయాను. అది తిన్నగా నన్ను బంగళాలోకి తీసుకుపోయింది. సముద్రము కేసివున్న వొకగదిలో శైలా పరుపుపై పడివుంది. ఆమె వంటిపై స్పృహలేదు. దగ్గరగావున్న చిన్న మేజాపై వొక కాగితము మడతపెట్టబడివుంది. నేను విప్పిచూచేను. బుద్ధిపూర్వకంగా నేనే ఆత్మహత్య చేసికొన్నానని శైలా ప్రకటించిందందులో. మూలనున్న కూజాలోని నీరుతీసి ఆమె ముఖంపై జల్లేను. ఆమె తలక్రింద రెండుగ దిండునుంచి ఉపచారములు చేస్తున్నా. పది నిముషములకు శైలా కనులువిచ్చి నా ముఖంలోకి చూచింది.

'మీరు వచ్చారు!...........లిల్లీ యిట్టిపని చేస్తుందని నే ననుకోన్నాను...........'

ఆమె మరల కనులు మూసింది. అప్పుడప్పుడు వూరుకొంటూ యిలా చెప్పుకొచ్చింది.

'నా పేరునుబట్టి మీరు సంశయింపవచ్చును కాని నేను పవిత్రమైన బ్రాహ్మణకుటుంబములో పుట్టేను. నా మొదటిపేరు రాధ. నాతల్లి అయిదవయేటను, నాతండ్రి పదియవయేటను చనిపోయారు. నాఅన్న నన్ను అతి ప్రేమతో చూస్తూ నాకు విద్య చేర్పించాడు. భాగ్యమైన, గౌరవమైన వొక కుటుంబములోని విద్యావంతుడైన వొకరికి నన్నిచ్చి వివాహము చేసాడు. నాకు పెండ్లిఅయి రెండు సంవత్సరము లయింది. ఆయన చదువు పూర్తిచెయ్యలేదు. పెద్ద చదువుకై లండను వెళ్లిపోయారు.........ఇంట్లో మావదినె పోరు ప్రారంభమయింది. ఒక సంవత్సరము యెంతో సహనముతో భరించాను. ఒకనాటి వుదయం నాఅన్న నాదగ్గరకు వచ్చి, 'మీ అత్తవారింటికి వెళ్ళుటకు నీ కిష్టమా?' అని అడిగేడు. 'ఆయనలేనితరి నే నక్కడకు వెళ్ల' నన్నాను. 'సరే' అని వాడు వెళ్లిపోయాడు. ఆరునెలలు గడిచాయి. క్రమంగా మా వదినెకు నాకూ జరిగే వివాదములు తీర్పలేక వాడికి విసుగు జనించినది. వాడి ఆనందమయ జీవితాకాశమున తోకచుక్క పొడమినది. వాడి విషాదమును నేను భరించలేకపోయాను. ఒకనాటిరాత్రి మాఅన్న సూటుకేసు తెరచి యిరవై రూపాయిలు తీసుకొని చీటివ్రాసి అనంతమైన యీ విశ్వంలో పడ్డాను. అప్పటికి నాకు పదునారేండ్లు. చెన్నపట్నం చేరాను. మాఅన్న స్నేహితు డొకడు సివిలుసర్జను. వొకవారంలో అతని సహాయాన్ని హాస్పిటలునర్సు ట్రయినింగుకు వెళ్లాను. అప్పట్లోనే నేను పేరు మార్చుకోటం అయినతర్వాత హాస్పిటలులో నొక సంవత్సరము నర్సుగా పని చేసాను. కాని అక్కడ...........'

లైలా వొకగడీ వూరుకుంది.

...........కొన్నివిషయాల్లో హేయమనిపించింది. నేను దాన్ని వదిలీసేను. తర్వాత వొక జాతీయపాఠశాలలో ప్రవేశించి శిశుపోషణము, చిత్రలేఖనము, కుట్టు యివి నేర్చుకున్నాను. ఆ పాఠశాల వార్షికోత్సవమునకు రాధాభాయమ్మ అధ్యక్షురాలుగా వచ్చింది. మా పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు నా తెలివి నుగ్గడించి చెప్పింది. రాధాబాయమ్మ నన్ను రమ్మని పిలిచింది. నేను వొప్పుకున్నాను. అప్పటికి చిన్నక్రేసీకి నాలుగేండ్లు. వారితో నే ననేక పట్నములు తిరిగేను. (కాని నేను వెళ్లిపోయిన తర్వాత ఆంధ్రదేశమునకు రావటం యిదే తొలిసారి.) నా యజమాని నన్నప్పుడప్పుడు వింతగా చూస్తుండేవాడు. అట్టిసమయాల్లో నాకు భయంగావుండేది. నే నతనికి వొంటరిగా కనబడే దాన్ని కాను.........నేను లిల్లితో బీచికి వచ్చిన నాటి సాయంత్రమే రాధాభాయమ్మ చిన్నక్రేసీతో చెన్నపట్నం వెళ్లింది. మీకు కనబడేసరికి అప్పుడు నేను భోజనంచేసాను. మీరు వెళ్లిపోయిన తర్వాత నేను నా గదిలోకిపోయాను. కాని నాకు నిద్రపట్ట లేదు. పైకివచ్చి రాధామనోహరందగ్గర నిలబడ్డాను. వెన్నెల కాస్తోంది. దగ్గరున్న గులాబీతుప్పలో నొక మొగ్గ అప్పుడే విడుతోంది. సరుగుడుకొమ్మలు చల్లని ఆ నిశావాయువులో మెల్లగా వూగాడుతున్నాయి. ఏదో వొక పట్టరానితమకము నన్ను ఉద్రేకించినది. అనిర్వాచ్యమైన యేదో వొక అపూర్వానందముకై నా శరీరము తహతహలాడింది. పైకి చూచేను. మీది మెట్టుమీద నా యజమాని నించున్నాడు......!

ఆమె మళ్లా వూరుకుంది.

ఆమె మొఖం జేవురించుకొనివుంది.

.........ఆ బంగళాలో యెవరూ లేరు. నేనూ, నా యజమానితప్ప. అతడు నన్ను లాలించేడు. స్వభావసిద్ధమైన అబలత్వముచే నే నాతనికి లొంగి

పోయాను.....................పదిరోజులు గడచి పోయాయి. రేపు రాధాబాయమ్మ వస్తుంది. నాకు విశేషదుఃఖ మెచ్చినది. నా ప్రకృతజీవనముపై అసహ్యమేసినది.........అందుచే విషము తిన్నాను.'

'విషము తిన్నావా!' అంటూ బ్రేసీ పరుపుదగ్గరకు వచ్చాడు. శైలా భయవిహ్వల అయినది. నేను నిర్ఘాంతపోయాను. కాని అతని కనులలో దుఃఖము పొంగి పొరలుతోంది. దానితో అతని ముఖం జేవురించుకొనివుంది.

"రాధా! నిన్నట్టి కష్టములపాలొనరించిన నీ భర్తను నేనె. లండనులోనున్నప్పుడే నీ కనేక జాబులు వ్రాసేను. నాకు నీ జాడే తెలియలేదు. ఈ దేశమునకు వచ్చిన తర్వాత నీకొఱకు వెదికేను. ఇందు నేను చేసిన తప్పిదమేమియు లేదు. నేను ఆంధ్రునివలె వుంటే నన్ను పోల్చివుందువేమో! కాని యీ ఆంగ్ల వేషమంతా నాకు విదేశములలో అలవడినది."

అతని కనులనుండి వొకటి రెండు అశ్రుకణము లామె వాడిపోయిన చెక్కిళ్లపై బడ్డాయి. శైలా తన రెండు కరములతో అతని కంఠమును పెనవైచి తన ముఖంమీదికి లాక్కుంది. అత డామె అదరుతోన్న పెదవులను ముద్దుపెట్టుకున్నాడు.

'ధన్యురాలను.'

రాధ కనులు మూసినది.........మరి ఆమె తిరిగి తెరువలేదు.

---

## సౌదామినీ

శ్రీమతి కొల్లూరి గౌరీదేవిగారు

ఈ యనంతగాఢాంధకారాయతాభ్ర
పథమునందున ఫెళఫెళార్భటులతోడి
జలద సంచయమందున సాగియొంటి
నెచట కేగెదో సౌదామినీ! వచింపు.

అతిమనోజ్ఞ నక్షత్ర నీలాభ్రవీథి
హర్షదానందములతో విహారమాకు
ప్రావృడభ్రపయోధర స్వామివలచి
తిరుగుచుంటివా యారీతిదిశల నెల్ల?

భయదగంభీరమా కృష్ణపక్షనిశిని
మ్లానమైన యీ యాషాఢమాసమందు
మినుకుమినుకంచు తారకల్ మెరయుచుండ
మెల్లగాసాగుచుంటివా మేఘుగూడి.

శంఖభేరీరవంబుల జైత్రయాత్ర
సలుప, సమరసన్నాహయుత్సాహమిళిత
ధైర్యసాహసగంభీర దర్పములర
విశృతవనాంతరోదగ్ర వీథులందు

గ్రేళ్లురుకు మృగచందంబు గేళిసేసి
వెడలుచుండెడి రసపుత్రువీరువోలె
నేగుచున్నావు, నీకంత వేగమేల?
ప్రబలదుర్భర సంతాపభరమును భవ

దమృతధారాప్రవాహంబు నణగజేసి
నవ్యనవనీత మృదుసమానంబులయిన
లేతభావంబులహ్మాది నిర్ణీతపరచి
సంతతానందమునుగూర్చి చనగరాదె?

# పండుగ సంబ్రమము

శ్రీమతి మూలపీపాల పార్వతీదేవిగారు

'నాన్నగారూ! ఇంకా రైలువేళుందా?' అంది లీల పెద్ద నిట్టూర్పు విడుస్తూ, వంటింటి గుమ్మందగ్గిర కూర్చుని.

'ఇంకా వొకరఘంట టైముందనుకుంటా నమ్మా! అప్పటికీ రాకపోతే నీవుకూడా భోజనం చెయ్యొచ్చ'న్నాడు, లీల తండ్రి ఆలోచిస్తూ మేడమీద పచారీచేస్తూ.

అలాగే వంటింటి గుమ్మందగ్గిర పట్టుచీర కట్టుకుని భర్తరాక కెదురు చూస్తోంది లీల. ఆమె తల్లికూడా కొంచెం దూరంలో అక్కడే కూర్చుంది.

లీలావతికి ముద్దుపేరు లీల. ఈమె పదియారేండ్ల బాల. మంచి చక్కని చామనచాయ పిల్ల. కళ్లుకూడా మంచి తీరుగా బేడిసల్లావుంటాయి. అంచేత రతీదేవిని ధిక్కరిస్తూ వుంటుంది అందంలో. సకల విద్యలూ నేర్చిన సరస్వతికూడాను.

లీల కాపురానికెళ్లి రెండు సంవత్సరాలౌతుంది. ఈమె కాపురానికెళ్లిన సంవత్సరందాటే కామెభర్త యేదో చదవడానికని కలకత్తావెళ్లేడు. అనురాగం భార్యాభర్తలకిద్దరికీ అధికంగా వుండడంచేత భర్త కలకత్తా వెళ్లి ఆరునెల్లేఅయినా అతన్ని చూడాలని లీల యెక్కువగా ఆత్రుత పడుతూవుండేది. లీల సంగతి గ్రహించి ఆమె తండ్రి అల్లుణ్ని పండుక్కెలాగేనా రమ్మని వుత్తరం వ్రాసేడు కలకత్తా. అత్తవారు పట్టుదలగా యెంత ఖర్చైనా పండుగకి రమ్మని వ్రాసేరని తప్పకుండా వస్తానని రిప్లైయిచ్చేడు జనార్దనుడు. అంతకుముందు మూడు రోజులనించి వస్తాడని కనిపెట్టుకు చూస్తున్నారు లీలా ఆమె తలిదండ్రులున్నూ. తెల్లవారితే పండుగొస్తుంది. రాత్రిపదైంది. లీల భోజనంమాని భర్తకోసం కనిపెట్టుకు చూస్తూవుంది. ఇంకారాలేదు జనార్దనుడు.

లీలమనస్సు పరిపరివిధాల పోతోందిప్పుడు. తనభర్త వస్తాడోరాడో అని ఆమె సందేహం. ఏదేనా ఆటంకం వచ్చిందో; లేకపోతే అతని దేహారోగ్యానికేమేనా భంగం కలిగిందేమో అని ఆమెభయం. అతని స్వదస్తూరీతో వుత్తరంవ్రాసికూడా రాకపోతాడా అని మళ్లా కొంచెం ధైర్యం తెచ్చుకుని మనస్సుసమాధాన పర్చుకుంటూ వుందా విచారంలోనే. ఆమె గాలిలో దివ్యభవనాల్ని నిర్మించుకుంటూవుందిప్పుడు.

అతను వ్రాసినప్రకారం కలకత్తాలో రైలెక్కడం; తరవాత అతని స్వగ్రామం చేరడం; అక్కణ్ణుంచి మళ్ళారైలెక్కి లీల పుట్టింటివారూరి స్టేషనులో దిగడం; దిగిన వెంటనే జట్కాకట్టించుకుని యింటికిరావడం; చీడీమెట్లెక్కి తలుపుతట్టడం;... కాని తలుపుచప్పుడు వినిపించుతేనా? అంచేతా




పుష్పాపచయము

భావలతక్కడవరకూ మాత్రమే వ్యాపించి, అక్కడ నిరాశాలవిభ్రమముచేత కోసివేయ బడుతూవుంది.

లీల చెవులు జట్కాచప్పుడుగాని బండీ చప్పుడుగాని ఆకర్ణించడానికి సిద్ధంగావున్నాయి. ఇంతలో జట్కాల చప్పుడు వినిపించింది లీల చెవులుకి. 'నాన్నగారూ! బళ్ల చప్పుడౌతోంది; రైలొచ్చినట్టేనా?" అంది సందేహా సంతోష సంకలితమైన మనస్సుతో లీల. 'ఔను, రైలొచ్చినట్టేవుందం'టూ మేడమెట్లాక్కొకటే దిగొస్తున్నాడు సుందరంపంతులు. ఇప్పుడు దాగర్లోపడ్డ నెలక్కాయలా వేగిపోతోంది లీల మనస్సు.

ఒక్కొక్క జట్కాయేవరసగా వెళిపోతోంది పీళ్లింటిముందునించే. చప్పుడు బహూ జాగ్రత్తగా వింటోంది లీల. ఒకటీ ఆగడం కనిపించదు. ఓ పదిపదిహేను జట్కాలు వరసగా వెళిపోయినతరవాత, ఓజట్కా సమంగా పీళ్లింటిముందే నిలబడ్డట్టు లీల మనస్సుకి తట్టింది. దిగ్గునిలేచి లాంతరు పట్టుకుని వీధితలుపు తియ్యడాని కెళ్లిందామె. ఆమె తలుపు తీస్తూవుండగానె 'ఇక్కడ కాదు, యింకానడవనీ' అన్నమాట వినిపించింది. జట్కా నడిచిపోయింది. జట్కా వెళిపోయేసరికి వీధితలుపుదీసి విఫలమనోరథయై వెర్రివెర్రి చూపులు చూస్తూ వీధి గుమ్మంకగ్గిర నిలుచుంది. ఇంతలో ఆమెతల్లి అన్నపూర్ణమ్మకూడా ఆమెను కలిసింది. 'ఈ జట్కా కాదమ్మా! వెళిపోయిందం'ది లీల.

మేఘసంకీర్ణమై యంధకారబంధురమైన రాత్రిని ప్రయాణంసాగించే పాంధుడికి మెరవుదీగతోవ చూపించినట్టు,సందేహాంధకార నిమగ్నమానసయైన లీలకి 'నీభర్తొస్తున్నాడ'ని చెప్పడాని కొచ్చినట్టుతటిల్లతా ద్యుతిని తలదన్ను కాంతితో అంతకుమించిన వేగంతోను వో జట్కావస్తోంది స్టేషన్‌తో వనించే. బహు ఆత్రుతతో ఆజట్కావేపు చూస్తున్నాది లీల. అంత వేగంతో వస్తున్న ఆజట్కా అక్కడాగదని భ్రమపడ్డ దామె. కాని తకీ మనక్కడే నిల్చిందా జట్కా. అధిక సంతోషస్వాంతయై చూస్తూవుంది లీల.

అంతలో వోనవీన యువకుడు దిగేడందులోంచి. అప్పుడు లీలసంతోషం చెప్పడానికి వశంగాదు. మబ్బువేసినప్పుడు మయూరిక సంతోషించినట్టు సంతోషిస్తోంది లీల. దీపం చూపించిందాయువకుడికి. బండివాడు సూట్‌కేస్ తెచ్చి గుమ్మంలోనుంచేడు. బండివాడికి డబ్బిచ్చేసేడు జనార్దనుడు లాంతరు వెలుతుర్ని. లీల పెట్టపట్టుకుని లాంతరుచూపిస్తూవుండగా యింట్లోకొచ్చే డతడు. పెట్టక్కడుంచి భర్తకి కాళ్లుకడుక్కోడానికి చెంబూ నీళ్లూ యిచ్చింది లీల. అక్కడుంచిన పెట్టని అన్నపూర్ణమ్మ తీసుకెళ్లి మేడమీద గదిలో పెట్టింది. మామగారు కుశలప్రశ్నలు ముగించిన తరవాత మడిగట్టుకు భోజనంచేసేడు జనార్దనుడు. భోజనానంతరం మామాజామాతల మాట్లాడ్డంఅయేక 'చాలా రాత్రైంది పడుకోవోయి'అని సుందరం

పంతులు పడుకోడాని వెళ్లేడు. జనార్దనుడు శయ్యామందిరంచేరి పందిరిమంచంమీద వెల్లకిలా పడుక్కుని లీలరాక కెదురుచూస్తున్నాడు. ఆవేళ మర్రెండు చేతులెరువు తెచ్చుకుని అతివేగంగా భోజనం చక్కబెట్టూ ముగించుకుని భర్తసాన్నిధ్యానికి బలేగా తయారై యొచ్చింది లీల.

'ఓహో! రాణీగారు! క్షేమంగావున్నారా'అన్నాడు జనార్దన్ నవ్వుతూ. లీల నును సిగ్గుతో క్రీగంటచూస్తూ వోచిరునవ్వు జవాబుగా నవ్వింది.........

'అల్లుడిరికం చూపించుకోడానిక్కాబోలు అర్ధరాత్రప్పుడొచ్చేరు? రాజుగారు!' అంది పరిహాసంగా చిన్ననవ్వు నవ్వుతూ లీల... నే నెప్పుడేనా జ్ఞాపక మొచ్చేదాన్నా కలకత్తాలో?"

జ్ఞాపకం లేకపోతే చీరెలా పంపించేను? చీరందినట్టు నువ్వే వుత్తరంకూడా వ్రాయలేదు. నీకానాకా జ్ఞాపకం లేకపోవడం?'

'ఔనౌను మీరలాగే అనుకుంటారు. మొన్నవొస్తానని మీరివ్వాళదాక రాకపోతే నేనెంత బెంగపెట్టుకున్నానో మీకేం తెలుసు'? అంది చిన్నప్రణయకోపంతో లీల.

'అబ్బ! నువొక్కర్తే శ్రమపడ్డట్టూ నేలేసట్టూనా? నేనూ శ్రమపడ్డాను.' అన్నాడు జనార్దన్ పరిహాసంగా.

'ఔను, బస్సూ రైలు జట్కా, కుదుపు గాదూ సుకుమారశరీరాలకి'అంది లీలావతి వికటంగా.

'ఇంటి దగ్గిరో ఘడియ నిద్దర్లేకుండా వుండడం మరీశ్రమ'

'మీరు రారేమో అని యెంతో...' అంది దీనంగా లీల.

'అయ్యో! పాపం'అంటూ దగ్గరకు తీసేడు లీలని జనార్దన్. 'పండుగనాడు కట్టుకుంటావని పంపిస్తే యిప్పుడే కట్టేసుకున్నావేం బెంగాలీ సిల్కుచీర' అన్నాడు లీల నెగాదిగా చూస్తూను జనార్దన్.

'కాదూ మరీ? భార్యాభర్తలు కలిసుంటే అదేపండుగ'అంటూ తన మృణాల హస్తాలతో జనార్దనుని కంబుకంఠాన్నలంకరింప జేసింది లీలావతి.

'ఓహో! యివ్వాళనించే మనకి పండుగా? అయితే యీ వేషంవంతా పండుగ సంబ్రమమేనా యేమిట'ంటూ లీలను దగ్గరకు తీసుకొన్నాడు.

# కాలగతి

శ్రీమతి కొత్త పద్మావతీదేవిగారు

ప్రణయమా—ప్రళయమా? అవునది ప్రణయమే? నిరవధిక ప్రేమ ప్రవాహ వీచికాపరంపరల దేలియాడు చాతకవిహంగయుగళ మాకాశపథమున తొలకరి—స్వచ్ఛ దివ్యాంబువులఁ గ్రోలినవి. ప్రావృట్కాలనినదభీషణ జలద సంజాతసౌదామినీ రక్తరంజితగాంతుల్లో, నాసాధ్వీమణి, హృదయేశ్వరుని, మానసాకాశమున, మొనలేని రత్నప్రభాపటలితో మెరసినది.

జ్యోత్స్నాప్రసారిత హృత్సరోవరమున ప్రణయబింబము ప్రతిబింబించినది. పవిత్రప్రణయ సందేశ శ్రవణములచే మానసము లుద్విగ్నములైనవి. సమ్మేళనానంతర సందర్శనముచే తనువులు బులకించినవి. తింత్రిణీమహీజ శాఖావిలసిత కోమల సుమపల్లవములు, హృదయ స్వారస్యమును వెల్లడించినవి.

కాని—ఇది ప్రళయమే! మధుపానాసక్త మధుపము ప్రియసుమంబున, మనుపిపాస బాపుకొననెంచి వ్రాలగనే, విరిసివిరియని నవ్యమకరంద బిందు సందోహ నిక్షిప్తహృదయప్రళము భూపతనమైనది.

భూపతనవిరామమున, నాపవిత్ర సుమము, రెండమృతంపు చినుకుల, సమీపదరు పత్రముపై జిలికినది. సహకారభూరుహ విలసితప్రకాశ ఫలముపై నధివసించి ముక్తకంఠమునుండి శ్రావ్యనాదము వెలువరింపగనే ఫలసహిత ముగ విహంగిపతనమైనది. ప్రశాంతశోభితాలంకారకౌముదీ కాంత క్రమక్రమముగ నవసన్నమై యుషఃకాలమున విలీనమైనది.

యుషఃబాల, బాల్యమువదలి, పదిఘటికలకు తారుణ్యమున నడుగిడి, మధ్యాహ్నమునకు ప్రౌఢయై సాయంతనమునకు సమసిపోయినది.

ప్రభూ? నీప్రకల్పనాచాతురి యమోఘమైనదిగదా?

లూసీ ఆమె మాధుర్యమైన చిన్న పేరు. ఆమె న్యాయకళాశాలలో చదువుచుండెను. ఉపాధ్యాయులందఱు ఆమెని సదా ప్రేమించుచుండిరి. కళాశాలాధ్యక్షులకుకూడ ఆమెయెడల విశేష ఆదరణకలదు. అధ్యక్షుడు యేదైన ప్రబంధసంబంధమైన కఠినసమస్య నెదుర్కొనవలసి వచ్చినచో, నాసమస్యను విడదీయుటకు తనకు తోచనపుడు లూసీని పిలిపించుచుండెను. ఆమె తోడనే ఆ కఠినసమస్యను విశదీకరింపుచుండుట కలదు. అధ్యక్షుడు తనశిరముపైనుండి ఒక భారము తగ్గినట్లు భావించుకొనుచుండును. ఇయన ఆమెను తనపుత్రికవోలె తలచుచుండెను. ఆమె సహపాఠకులుకూడ ఆమెను కడు ఆదరించుచుందురు. వాళ్లు తఱచు "లూసీ చతురతాసంకలితవిజ్ఞతె ఒకనాడు న్యాయాధిపతి స్థానము నాక్రమించగల"దని అనుచుండ ఆమె ఊరక వినుచు నవ్వుచుండును.

లూసీ ఎలప్రాయమునమున్నది. ఆమె శరీరము శుక్తిని పరిహసించును. ఆమె ప్రతిరోమమునందును కౌమార్య దీధితి మిణుగురుల చల్లుచుండెను. ఆమె ఆకృతినిర్మాణము హృదయాకర్షకమైనది. లూసీ రూపలావణ్యములచే సౌందర్యవతులని చెప్పదగిన ఏ యువతికిని తీసిపోవునది గాదు. ఆమె ఫ్రాన్సుదేశ సౌందర్య పభ్యతాస్థానమునందు భాగస్తురాలైనచో తప్పనిసరిగ విజయము ఆమెదే. లూసీ ఇంకను వివాహవేదిక నెక్కలేదు. కాని ఆమె తన హృదయమును చార్లెసుడారన్‌కు అధీనము చేసియున్నది. ఫ్రాన్సులో నీవిధముగ నిరువది యిరువదిరెండు వర్షముల వయస్సు వచ్చువఱకు తమ ప్రేమనపాత్రన్యస్తముగానీక సురక్షితముగా నుంచుకొనగల్గిన వనితలు బహు తక్కువ. అగుగాక, లూసీ ఇప్పుడు డారనును తన ప్రేమలతకు సహకారము కాతగినవానినిగా నెంచెను.

డారను యొక సాధారణయువకుడు. అతడు చాల బీదవాడు. లూసియొక్క సహాధ్యాయుడు. అతని యోచనలు మిగుల స్వతంత్రములు. అతడు న్యాయకళాశాలలో నిల్చి తన గంభీరభాషణల నుపన్యసించుచున్నపుడు విద్యార్థులెల్లరు స్వాతంత్ర్యముయొక్క భవిష్యత్స్వప్నముల నెంచుచు మైమఱచుచుందురు. ఉపాధ్యాయులందఱు "చార్లెస్! నీవు ఒక స్వాతంత్ర్య జాతీయ విప్లవకారిసమితి సంచాలకుడవై ఫ్రాన్సునందు అపూర్వస్వాతంత్ర్యజాగ్రతను సృజింపజేయగలవు" అని వచింపుచుందురు. చార్లెసు వీనిని వినుచు స్వాతంత్ర్యసాగరతరంగములపై తన భావిజీవితనౌక ఉయ్యాలలూగుచుండుటను తిలకించుచుండెను.

## ౨

పరీక్షాదినములు సమీపింపదొడగెను. న్యాయకళాశాలపిల్లలు ప్రాణపణముగ పరిశ్రమ చేయుచున్నారు. ఒకక్షణముగూడ నెవరు వ్యర్థముగా పోగొట్టుకొనుటలేదు. ఎల్లఱు తమతమ కార్యక్రమము నిర్మించుకొని, ఆ నియమానుసారము పఠనాది కార్యములను చేయుచుండిరి. ఇప్పుడు చదువుటయందు లగ్నమనస్కుడు కానివాడు కేవలము డారను మాత్రమే. కారణము అతడు వర్షాదినుండియు తీవ్రపరిశ్రమ చేసియుండుటయే కాని ఈసమయమును అతడు వ్యర్థముగా పోగొట్టక, భావియోచనలయందే గడుపుచుండెను. పరీక్షలో నుత్తీర్ణుడైన పిమ్మట యేపని చేయవలయును? న్యాయవాదవృత్తియా? నావలన అట్టి కార్యమగుట అసంభవము. స్వతంత్రభావోన్మాదుడగు నొక యువకుడు ఎప్పుడు వకీలుగా నుండజాలడు. చార్లెసు ఇట్టి యుద్యోగములను గర్హించువాడు. అతని యుద్దేశము తా నొక సాంఘికవిప్లవకారుడగుటయే. అందువలన అతడు తన ఆశయమును

కార్యరూపమున బెట్టదలంచుచుండెను. కాని ఈ యుద్దేశమున నెట్లు సఫలతగాంచుట ? అను ప్రశ్నయే డారను ఎదుట జాగరితమగుచుండెను. అతడు ఈ విషయమయ్యే అతినిగూఢ విచారము చేయుచుండెను.

కాలము సువాయాసముగ గడచిపోవుచున్నది. మెల్ల మెల్లగ మూడు మాసములు దాటినవి. నాడు పరీక్షాఫలితము వెలువడినది. లూసీ కళాశాలలో ప్రథమస్థానమున ఉత్తీర్ణురాలైనది. ఆమె ప్రేమించిన చార్లసు డారనుగూడ ఉత్కృష్టముగానే ఉత్తీర్ణుడై నాడు. విద్యార్థిబృందము పరస్పరము సఫలతాసేతలకు ధన్యవాదములు సమర్పించుకొనుటకు తత్పరులైరి. పలువురు విద్యార్థులు లూసీకి పరీక్షలో శ్రేష్టముగ ప్రథమస్థానమున ఉత్తీర్ణురాలైనందుకు ప్రశంసాపత్రమును పంపిరి. లూసీ యానందమునకు మేరయేలేదు. డారన్ లూసీ గదికిపోయి, "లూసీ! పరీక్షలో సర్వోత్తమముగ సఫలతను బొందినందుకు ఇవే అభిమతులు" అన్నాడు. లూసీ నమ్రతతో "నమస్కారములు. ఇదంతయు మీ కృపావిశేషమే !"

"నా కృపావిశేషమా ?"

"అవును."

"ఎట్లు ?"

"ఎట్లన, మీ ప్రయత్నముచేతనే నేను ఇట్టి సాఫల్యతను బొందగల్గితిని."

"మంచిది డారన్ ! ఇవన్నియు పునశ్చరణము చేయుట వ్యర్థము. ఇప్పుడు మనము ఏమి చేయవలయునో చెప్పుము !" లూసీ అతని సంభాషణ మార్చుటకొఱకే ఈ ప్రశ్నను వేసెను.

"నీవు చెప్పుము."

"మనము ఉభయులము కలసి ప్లీడరుపని యారంభము చేయవలెనని నా మనస్సునకు తట్టుచున్నది. ఏమి బాగున్నది గదూ."

"లేదు. నేను ఈ ప్రస్తావనను విభేదించుచున్నాను."

"అయిన మీరు ఏమి చేయుదురు ?"

"ఏమి నీకు తెలియదా ? నేను ఫ్రాన్సునందు జాతీయవిప్లవమును వ్యాపింపజేయుదును. ఒక విప్లవకారుడనై ధనవంతులు బీదవారిపైన ఇష్టమువచ్చినట్లు చేయు క్రూరదౌష్ట్యములను ప్రతిఘటింతును. స్త్రీల యెడల ధనవంతులు సల్పుచుండు అత్యాచారములను కూకటివేళ్లతో పెకల్చివేసెదను. ధనవంతుడు, బీద అను భేదములేకుండ నిర్మూలము చేయుదును. అప్పుడే ఫ్రాన్సుదేశమునకు శాంతి లభింపగలదు. అన్యథా కాదు."

"అయిన డారన్ మీ జీవితము అత్యంతభీభత్సమును, భయంకరమునునై పోవును."

"కానిమ్ము. అందులకై నాకు నీమన్నాత్రమేనియు చింతలేదు."

"మరి నేను ?"

"నీ యభీష్టము న్యాయవాదినివి కావలెనని యున్నది. కావున న్యాయవాదినివేకమ్ము. పరమేశ్వరుడు నీ యిచ్ఛను నెరవేర్చును."

లూసీ ఆంతరికాభిలాష న్యాయవాదవృత్తి నవలంభింపవలయునని ఉన్నటుల డారను యెరిగి ఉండెను.

డారనుయొక్క స్వతంత్రోద్దేశములకు ఆమె సాయ మావశ్యకమైయుండెను. కాని ఆమె యొక విద్రోహవిప్లవకారిణీ యువతియొక్క కర్తవ్యమును జేయుగలదా యని డారను సందేహించుచుండెను. అందుచే లూసీకి న్యాయవాద వృద్ధి చేయుటకు సలహా యిచ్చెను.

మఱునాడు ప్రాతఃకాలమున లూసీ నిద్రలేచినపుడు, ఆమెకు తన పడకమీద నొకలేఖ కనుపించినది. దానిపై సుందరాక్షరములతో "లూసీకి" అని వ్రాసియుండెను. ఆత్యుత్కంఠతతో దానిని ఆమె చదివెను.

అందు—

"ప్రియమైన లూసీ!

మన యుభయుల కార్యారంభ విచారణయందు అంతరమున్నది. నీవు న్యాయవాదినివి కావలయునని కోరుచున్నావు. మఱి నేను దేశసేవచేయ నభిలషించుచున్నాను. తొలుతనుండియు మన పరస్పర సంభాషణలయందు వకీలుపని జేయుటకు నీవు సోత్సాహివై యున్నట్లు నాకు స్ఫురించినది. అనుగాక, ఇప్పుడు అర్ధరాత్రమున నీ సెలవు నందకయే నేను వెడలిపోవుచున్నాను. ఎట కేగెదనో నాకే తెలియదు. నన్ను మఱచిపోవలదని మాత్రమే కోరుచున్నాను.

నే నిట్టి అసందర్భసమయమున వెడలి నీయెడల నిజముగ మహత్తర అపచారము చేయుచున్నాను. మీదుమిక్కిలి నీ అమూల్యప్రేమను గెంటివేయుచున్నాను. కాని ఏమి చేయగలను? వివశుడను. దీనుల శోచనీయ దుర్దశయందు నీ అవాచ్యప్రేమకూడ తుచ్ఛముగ నా కగపడుచున్నది. నన్ను క్షమింపుము. చూడుము. ఒకవేళ ఈశ్వరానుగ్రహమున ఫ్రాన్సులో నెప్పటికి సంపూర్ణశాంతి నెలకొనునో, అప్పుడు మరల మనము కలిసికొనెదము. లేనిచో ఇదియే నా తుది జాబు.

నీ ప్రియమైన
చార్లెసు.

లూసీకి జాబు చదువుటవలన ఖేదమోదములు రెండును అనుభుక్తమాయెను. కాని ఖేదము మాత్రము మిక్కుటముగానుండెను. ఆమెకు తన ప్రియతముడు తెలియకుండ పోయినందులకు అపరిమిత దుఃఖము గలిగెను. ఆమె భావి ఆశాకమలము తుషారాచ్ఛాదిత మాయెను. ఆమె భవిష్యజ్జీవితాకాంక్షలు విచ్ఛిన్నమయిపోయినవి. ఆమె అరవిరి వాంఛాపుష్పము వాడిపోయెను. లూసీ యోచనాగ్రస్తయై విచారములో మునిగినది. ఆమెకు ఈ యతులనీయ ప్రాపంచకమంతయు శూన్యముగాఁ గనుపింపసాగెను. ఆమె కర్తవ్యవిహీనయైపోయినది.

౪

"హత్య!"

"ఎవరిని!"

"ఆ దుష్టుడైన మార్క్విసుని."

"నిజము చెప్పుచున్నావా?"

"సోదరీ, ఎన్నడైన నీతో నే నబద్ధము చెప్పియున్నానా?"

"కాని నమ్మకము గలుగలేదు."

"అవిశ్వాసమునకు కారణము?"

"మార్క్విసు ఏదో సాధారణస్థితిలోనున్న మనుష్యుడు కాదు. అతడు ఒక ప్రతిష్ఠిత రాజోద్యోగియగుటయే అవిశ్వాసమునకు కారణము. అతడు ఫ్రాన్సుదేశముయొక్క కుబేరతుల్యులైన ధనాఢ్యులలో గణింపబడినవాడు. వాని సౌధమునందు నిరంతరము కఠినమైన పహరా యుండును."

"సరే, కాని ఇప్పుడు ఆ దుష్టుడు నరకమున విహరించుచుండును. సోదరీ, నేను అసత్యము చెప్పుటలేదు. నీవు రేపు కోర్టుకు పోయెదవా? బహుశా ఆ యువకుని కేసు న్యాయస్థానమునకు వచ్చును. ఏమగునో చూడుము. ఆ యమరుని అంతమొనరించిన యువకు డెవడో గొప్ప సాహసకుడు. వానిని పరమేశ్వరుడు రక్షించును గాక!"

"సోదరీ, తప్పక పోదును. ఇదియంతయు నేను పరిహాసముగానే భావించుచుంటిని. భగవంతుడు ఆయువకుని అవశ్యము రక్షించును. అత డెవరో నీ వెరుగుదువా?"

"సరేగ తెలియదు. కాని బహుశః అతడు చార్లెసు డారనయేమో?"

"మంచిది సోదరీ, చాల ఆలస్యమయినది. ఇక నేను పోవుదును."

* * * *

ఆదినములలో మొన్స్యేరు మార్క్విసుని అత్య

చారములు దినదినము వృద్ధిబొందుచుండెను. ప్రజలు వాని అపకృత్యములచే హృత్పీడితులై పోవుచుండిరి. సమస్తప్రజలు క్లేశభరితులై కుందుచున్నారు. ఎల్లరు మార్క్విసుకు విరోధులే. కాని ప్రత్యక్షముగా నెవరు వానికి చెఱుపు చేయజాలకుండిరి. అతడు ఒక యుచ్ఛపదవినున్న రాజోద్యోగి. శ్రీమంతుడు. కాబట్టి ప్రజలు అతడనిన భయపడుచుండిరి. కాని దేశారాధకులు అతడనిన మండిపడుచుండిరి. దుష్టుడగు మార్క్విసు ధనమదోన్మత్తతలో నుత్తములైన అనేక సాధ్వీమణుల సతీత్వాపహరణము చేయుచుండెను. ఎందఱి మానవతుల పాతివ్రత్యము నతడు తన అసురకృత్యములచే నాశము గావించెనో లెక్కింప నలవికాదు. ఫ్రాన్సుదేశమున అతడు ఘోరకార్యములయందు సుప్రసిద్ధుడు. నిరుపేద స్త్రీలు వాని పేరు వినినదే దద్దరిల్లి పోవుదురు.

నేడు ఫ్రాన్సుదేశవాసులగు బీదజనులు సుఖశాంతములను ఊపిరి తీసుకొని మెసలుచున్నారు. నేడు ఫ్రాన్సులోని దారిద్ర్యపీడితులైన దేశీయులు సుఖస్వప్నములను గాంచగలిగిరి. నేడు ఘాతకుడగు మార్క్విసును జంపినవానికి అనాథసాధ్వీమణులు స్వచ్ఛహృదయములతో ఆశీర్వాదములు యిచ్చిరి. నిజముగ దుర్మార్గుల మృత్యువునకు ఎవరు వగతురు?

౫

ప్రపంచము పరివర్తనశీలమని ఎవరో సత్యముగానే వచించిరి. లూసీ ఎప్పుడైన న్యాయాధీశపదవిని అలంకరించునని యెవడైనా అనుకొనగల్గియుండెనా? కాని భగవంతుని మాయ అపారమైనది. నేడు ఒక యువకుని జీవితమరణములు ఆమె విచారణపై నిర్భరములైయున్నవి. ఏయువకుని ఆమె సదా ప్రేమించుచుండెనో, ఎవనిని తన ప్రేమకు పాత్రునిగా చేసికొనుటయే తనకు గౌరవప్రదముగా భావించుచుండెనో ఆ యువకుడే అతడు—నేడు తన ప్రియురాలి యెదుట అపరాధబోనులో నిలబెట్టబడును. లూసీ వాని మరణదండన తీర్మానము వినిపింపగలదు. రేపు యేమగునో? ఎవరికెరుక? హా ఈశ్వరా! కేవలము నాలుగువత్సరముల స్వల్పకాలములో నొక ప్రేమమయజంటయొక్క జీవితమునందు ఎంతటి పరివర్తనము గలిగించినది. వారు ఎప్పుడైన నొకరొకరు విరోధులు కాగల్గియుండిరా? తమ భవిష్యజ్జీవన సుఖస్వప్ననిషాలో మత్తులగుచుండిరి. నేడు ఆ ప్రేమయుగళ జీవితమునందు ఎంత గొప్ప అంతరమున్నది— ఎంత తారుమారైనది!!

ఇదో, న్యాయాధీశురాలు వచ్చినది. అందఱు లేచినిలచి అభివాదముచేసిరి. అపరాధిని బోనులోకి తీసికొనివచ్చిరి. ప్రభుత్వన్యాయవాది అపరాధిని ప్రశ్నించెను. 'యువకమహాశయా! మీ పేరు యేమి?'

"నన్ను ఒకప్పుడు ప్రజలు చార్లెసుడారను అని పిలుచుచుండిరి" అని యువకుడనెను.

న్యాయాధిపతియైన లూసీ డారను తన పేరు చెప్పుట విని తొట్రుపడెను. కాని తోడనే సమాలించుకొని గంభీరత వహించెను. ఆమెకు వారి కళాశాలదినములు స్మరణకు రాదొడగెను. డారనుగూడ ఇప్పుడు గంభీరముద్రితుడైనాడు. అతడును తన ప్రియనుగూర్చి ఏదియో యోచింపుచుండెను. లూసీ ఇంత స్వల్పకాలముననే, ఇంత యున్నతపదవిని బొందునని అతడు తలచియుండలేదు. వానికి గత జీవితయొక్క కొన్ని వర్షముల యనుభవము యోచనాగతమాయెను. కాని తత్క్షణమే అది యణగిపోయెను. అతడు వెంటనే తన స్థితిని యెఱిగి తన్నుతాను సమాలించుకొనెను. లూసీకి మాత్రము తాను స్వప్నదృశ్యమును జూచుచున్నట్లు ద్యోతకమగుచుండెను. ఆమెకు డారను చివరలేఖలోని "నన్ను మఱచిపోవలదు" అను శబ్దము జ్ఞప్తికి వచ్చినది. ఆమె కొంతసేపటివఱకు కింకర్తవ్యతా విమూఢయైనది. కాని శీఘ్రమే ప్రకృతిస్థయై అపరాధితో గంభీరస్వరమున డారన్ నీవైన మార్క్వి

మని హత్యచేసిన నేరము ఆరోపింపబడియున్నదని నీకు తెలియునా ?

"అవును" అని అభియుక్త కడువేగముగా సగర్వోత్సాహముతో జవాబు చెప్పెను.

"అయిన నీవే మార్క్వెసుని చంపితివా ?"

"అవును."

"అందుకు కారణము ?"

"కారణమా ? ఎవరికి తెలియదు ! మీరు ఒక ప్రధానన్యాయాధిపతులై యున్నారు. ఒకవేళ మార్క్వెసు పరమదుర్మార్గుడును, కౄరుడును అని చెప్పిన నన్ను మన్నింతురు గాక ! అట్టివానిని నేను సహింపజాలను. ఇంతకన్న అధికము యేమి చెప్పను."

"అతడు మీయెడల కెట్టి దౌష్ట్యమును చేసెను?"

"నాయెడల కాదు. నా అసంఖ్య సోదరీ సోదరులయెడల."

"ఈ వాచ్యము నీకు వ్యతిరేకముగానున్నది. ఇంకను యేమైన చెప్పుకొన దలచితివా ?"

"లేదు" అని డారను అతిగంభీరతతో వచించెను.

లూసీ స్తంభితయైపోయెను. ఒకవేళ ఈసమయమున ఆమె న్యాయవాదినియే అయిఉండిన అపరాధి పక్షమున నిల్చి వెంటనే అతనిని విడిపించుకొనియుండును. కాని అయ్యో! ఏ న్యాయాధీశపదవికై లోకులు తమ ప్రాణములనైనను అర్పించుటకు సంసిద్ధులగుదురో, అదియే ఈసమయమున లూసీకి హృదయవిదారణమునకు హేతువాయెను. ఆమె ప్రియుని వాక్యములు, అతనికి విరుద్ధపక్షమున బుజావగుచుండెను. ఇంతియేగాక ప్రభుత్వన్యాయవాది అభియుక్తునికి వ్యతిరేకముగా నింకను ఎన్నియో ప్రమాణములను దాఖలుచేసెను. ఈ ప్రమాణములన్నియు లూసీ మనోవ్యధను నధికరించినవి. కాని గవర్నమెంటు వకీలు తన వ్యర్థప్రలాపములను విజృంభింపజేయుచునే యుండెను. తుదకు లూసీ కోపముతో 'అపరాధి తనపైన మోపబడిన నేరమును స్వయముగా నంగీకరించుచున్నపుడు ఇంకను ప్రమాణములవలన నేమి ప్రయోజనము ?' అనెను.

ప్రభుత్వన్యాయవాది మెదలకుండెను. లూసీ ఒకపరి తన ప్రియుని ప్రేమమయదృక్కులతో వీక్షించెను. నేత్రములు అశ్రుపూరితములాయెను. ఒకదినము కళాశాలలో నాడబడిన నాటకములో ఆమెకు న్యాయాధిపతి పాత్రను, చార్లెసు డారనుకు అభియుక్తుని పాత్రను యిచ్చినదియు, అభియుక్తునకు తాను మరణదండ ఆజ్ఞయిచ్చినందుకు, ఉపాధ్యాయులు తన్ను యెంతయు శ్లాఘించినదియు గుప్పున స్మరణకు వచ్చెను. ఆహా ! ఒకప్పుడెప్పుడో ఆడబడిన కృత్రిమ నాటకము, ఈ ప్రపంచ స్వాభావిక సత్యవేదికపై నిజముగ నాడబడునని ఎవరికి తెలియును ? దీనిని ఈశ్వరలీల అనుటకన్నను మన మేమి చెప్పగలము?

కేసుయొక్క పరిష్కారమునకు ఒకవారము తరువాత వాయిదా వేయబడెను.

౬

"ఉరియా ! కాదు. ఎప్పుడును అట్లు కాజాలదు. నేను నా ప్రియునకు స్వయముగా నా నోటితో ఉరిశిక్ష వినిపించుటయా ? లేదు. కాని, నేను కర్తవ్యనిర్వహణముకొఱకు బాధ్యను చేయబడియున్నాను. నేను న్యాయపీఠమున గూర్చుని అన్యాయమును ఎప్పుడు చేయజాలను. హత్యానేరమునకు మరణదండనయే అయినను, అపరాధి తన నేరమును స్వయముగా నొప్పుకొనుచున్నాడు. నేను అస్వాధీనను. కర్తవ్యముగూడ ఒక వస్తువయే."

ఇట్లు గొణుగుకొనుచు లూసీ లేచి తన గడియారమువైపు చూచుకొన వేళయైయుండెను. ఆమె కోర్టుకు పోవుటకు సిద్ధముగావలెను.

* * * *

న్యాయాలయమునకు పోగానే మొట్టమొదట

లూసీ ఎదుటకు డారన్ కేసే వచ్చెను. ఒకసారి మనసార తాను ప్రేమించిన ఆ యువకునితో కలిసి మాటలాడవలెనని ఆమెకు తోచెను. కాని అస్వాధీన—అట్లుచేసిన ఆమె కర్తవ్యచ్యుతయగుట సంభవించును. ఆమె తన ఆదర్శధర్మమునుండి పడిపోగలదు.

కొలదిసేపు నిదానించి లూసీ కంపితగాత్రముతో తీర్మానమును వినిపించెను. "నేరస్తునకు చట్టనియమము ననుసరించి మరణశిక్ష విధించగమైనది. పదునేను దినముల తరువాత ఉరి తీయబడును."

"ఉరి, ఉరి" కోర్టు నలుదెసల ఈశబ్దమే వినపడెను. ఎవరి శ్రేయముకొఱకు మార్క్విసను అంత మొందింపబడెనో, ఆ కడుపుకాలిన ప్రజలును, అనాథలైన విధవాంగనలును, వానిచే పరాభవింపబడిన కులస్త్రీలును ఎలుగెత్తి ఏడువసాగిరి. వారి క్లేశములకై ఈ యువకుడు తన ప్రాణములను బలి చేసివేసెను. అపరాధియగు డారను హాసవదనుడైయుండెను. వాని వదనముపై నెక్కడ విచారచిహ్నములు పొడచూపలేదు.

పదునేను దినములు గడచుటకు ఎంతసేపు కావలయును. రేపు ఉదయము చార్లెసుడారన్‌ను ఉరి తీయబడును. ఈ దుఃఖపూర్ణప్రపంచమున యుండుటకు అతనికి యిది తుదిరేయి. అయ్యో! ఈ సుభాగ్య యువకునకు యేయేమి ఆశల[illegible]యుండెనో? అతడు ఫ్రాన్సునందు ఒక అపూర్వ[illegible]ంఘికవిప్లవాందోళనమును వ్యాపింపజేయదలచుచుండెను. కాని పాపము వాని యిచ్ఛ సంపూర్ణముగా సఫలీభూతము కాలేదు. వాని నవవికసిత ఆకాంక్షకోరకము వృంతచ్యుతమాయెను. అటులయ్యును అతడు పరమశాంతముతో సంతుష్టుడైయున్నాడు. ఒకపాపిని చంపి చచ్చుచున్నానను సంతోషమే అత డనుకున్నట్లు కనుపించుచున్నది.

తెల్లవారెను. ప్రభాకరుడు తన అపరంజి కిటికీనుండి ముఖము వెలువరించెను. ఆ పవిత్రసమయమున చార్లెసుడారను దేవునిగూర్చి తన అంతిమప్రార్థన చేసెను. ఆహా! ఈప్రార్థన యెంత ప్రేమపూర్ణమును, ఎంత స్వార్థరహితమును ఎంత మాధుర్యమునునై యున్నది.

"యువకుడా కదలుము?" అని హంతకుడు నమ్రుడై చెప్పెను.

"పద" అనుచు డారన్ హంతకుని యనుసరించెను.

హంతకుడు—"అయ్యా, ఇదియే నా కడసారి వందనము గైకొనుము."

డారను ప్రేమభరితదృష్టితో హంతకునకై చూచెను. హంతకుడు మరల అయ్యా, "నేను అస్వతంత్రుడను" అనెను.

డారను హంతకుని అభిప్రాయమును గుర్తించి—స్వాధీనస్వాధీనతలకు యిప్పుడు ప్రమేయమేమి? ఇది నీ కర్తవ్యము.

ఇంతలో డారను వధ్యావేదికను సమీపించెను. ఉరికాలము నిర్ణయించువాడు డారన్‌ను వాని చివర యభిలాష యేమో చెప్పుమని అడిగెను. డారను వానికి ప్రత్యుత్తరము మాతృస్తవ మొనర్చుటకు మాత్రమే తనకుగల వాంఛను తెలిపెను. మాతృస్తుతి యనంతరము డారను హత్యావేదిక నెక్కెను. అతడు తన నలుదిశల పరికించెను. ఎవరినో అన్వేషించుచు, వాని తృషితనయనయుగులు ఒక స్త్రీవంకకు పరువిడెను. చార్లెసు కనుదోయినుండి అవిరళధారావాహిని వెడలదొడగెను. అవి ప్రేమాశ్రువులు. వెల్లివిరిసెను. ఆమె దృష్టియు, ఇతని దృష్టిని యెదుర్కొనెను. ఇట్టి యనుపమ ప్రేమాశ్రుకణములే ఆతనికి ప్రత్యుత్తరములైయుండెను. ఆ ప్రేమమయ జంటకు ఇదియే తుదికలయిక. వారిరువురి హృదయములు తమతమ ప్రేమాశ్రువెల్లువలో కొట్టుకొని

పోసాగెను. ఆహా! ఈ కలయికయందు ఎట్టి అపూర్వత — ఎట్టి అనురాగమాధుర్యత — ఎట్టి అకలంక ప్రేమ — ఎట్టి హృదయ నిర్మలత నిండియుండెను. ఈ అశ్రువులే కొన్ని వత్సరములనుండి కలయికలేని కొదువను పూర్తిచేసెను. చార్లెసును తన ప్రియురాలును ప్రేమనిబిడదృక్కులతో చూచుకొనుచు, కడకు డారను ఉరిత్రాటని తన కోమలకంఠమునకు తగిలించుకొని, ఈ పార్థివప్రపంచమునుండి శాశ్వతముగా సెలవు గైకొనెను.

౭

లూసీ న్యాయాధీశపదవిని త్యజించెను. నాటి నుండియు ఆమెను ఫ్రాన్సుదేశమున నెవ్వరు చూచియుండలేదు.

అవును. ఆ భయానక కాళరాత్రిలో ఫ్రాన్సుదేశీయులు ఒక యోగినిని, ఆ ప్రాంత్య సాంద్రారణ్యమున తిరుగుచుండుటను మాత్రము అవశ్యముచూచిరి.

అఘోరనిశీథసమయమునగూడ గ్రామస్థులనేకులు ఆమె వెనువెంటనే ఫ్రాన్సుదేశ నిబిడాటవుల సంచరించుచుండువారు. తప్పక ఆమెలో నేదియో దైవశక్తి యుండియుండును.

—హిందీ అనువాదము.

---

# సస్యలక్ష్మి

శ్రీమతి క. హేమలతాకుమారిగారు

౧

ప్రాణికోటులరక్షించు భాగ్యలక్ష్మి
కర్షకావళిపాలిటి కనకలక్ష్మి
సౌఖ్యసంపదలొసగూర్చు సాధులక్ష్మి
సస్యలక్ష్మిరో నీకు సుస్వాగతంబు.

౨

పచ్చపచ్చని కెరటాల పరువులెత్తు
సస్యశ్యామలసుందర సాగరమున
తాండవించెడి నీదు సౌందర్యమునకు
పొంగిపోవు నాయెద నింగి కెగసి.

౩

బాలభానునికిరణాల జాలువారు
హిమకణంబులు ముత్యాలసుమములట్లు
తలనుదాలిచి వెలలేని చెలువుమెరయ
సాగిరావమ్మ మాపాలిసస్యలక్ష్మి

౪

నిత్యకళ్యాణలక్ష్మికి నిలయమైన
పంటభూములలోనుండి బయలువెడలి
పరమపావనమైన నీపాదయుగము
మాదుగేహమునందిడి మనుపుమమ్మ.

# కామేశ్వరి

అయ్యలసోమయాజుల సుబ్బారావు

సహగమనము అనగా పతిననుగమించుట. ఇది పూర్వాచారం. పూర్వకాలపు వారిలో సహగమనమున కొప్పుకోనవి స్త్రీలు బలాత్కారముగకూడ సహగమనం చేయింపబడేవారు. సహగమనం చేయని స్త్రీని అతి నీచంగా చూచేవారు. నిజంగా సహగమనం అనగానే చితిలో వురికినంత మాత్రముననే కాదు. ఇష్టములేని సహగమనము చేయించినంతమాత్రమున అది సహగమన మనిపించుకోదు. మనస్సెక్కడ, దేహము చితిలోనూ వుంచినచో నది సహగమనమా? ఈ కాలములో భర్తచనిపోయిన స్త్రీకి కేశఖండనమొక ఆచారముగా పరిగణిస్తున్నారు. ఇందులో అంతమందీ కేశఖండనమొక ఆచారముగా పరిగణిస్తున్నారు. ఇందులో అంతమందీ కేశఖండన కొప్పుకుంటున్నారా? ఒప్పుకోకపోయినప్పటికీ ఆచారం మానలేదు. అలాగే పూర్వం సహగమనంకూడా తప్పనిసరిగావుండేది. దీనిని ముందు నిరసించినవాడు అక్బరు సార్వభౌముడు. ఇష్టమున్నప్పుడుగాని లేనిచో బలవంతంగా సహగమనం చేయించవద్దని శాసించాడు. తరువాత యిష్టమున్నప్పటికీ సహగమనం చేయుటకు వీలులేకుండా గవర్నమెంటువారిచే శాసనము అమలులో పెట్టించి పూర్తిగా మాన్పించినవాడు రాజా రామ మోహనరాయలు. ఇప్పటికి పేరునకైన సహగమన మనునదిలేదు. అయినప్పటికీ కొంతమంది పతివ్రతామతల్లులు తమ మాహాత్మ్యమును జూపి బంధువులకు ప్రభుత్వమువారివల్ల కష్టములు కలుగకుండచేసి పతిననుగమిస్తున్నారు. అట్టివారల జీవితము లిదివఱకు చెప్పియున్నాను. ఇప్పుడు చెప్పబోయే శ్రీ కామేశ్వరీసతి వాారలవలె భర్త చితిలో నురుకకుండ సహగమనంచేసింది. అలాగని నూతులోనో, గోతులోనో దిగలేదు. ఒకవైపు భర్త అమాయికత్వము, ఒకవైపు మామగారి క్రూరకృత్యములు. అన్నిటికీ వహించి పుత్రుడుపోయి భర్తపోయి దుఃఖావస్తలోనుండినప్పటికీ తనధైర్యము తాను వీడక తన దేహాన్నే చితిగా నేర్పఱచుకొని జఠరాగ్ని ప్రజ్వలింపజేసి తనశక్తి సామర్థ్యములకు ప్రేక్షకులు నిశ్చేష్టులై యున్నప్పుడు తాను పతిని గలుసుకొనిన సతీస్వరూపిణి ఈమె.

ఈమె విద్యలకు పెన్నిధానమని చెప్పబడు విజయనగరములో పుట్టి ధర్మవరమున గల నొక భాగ్యవంతునియింట వారి కోడలై ప్రవేశించింది. ఈమె గుణములు వర్ణించడానికిముందు ఈమె శ్వశురగృహచరిత్రకూడా మనము తెలుసుకోవాలి.

జోగప్పగారు ధర్మవరం భాగ్యవంతులలో నొకరు. ఆతనికి పుట్టి ప్రపంచజ్ఞానం వచ్చింది లగాయితు ఎదురుపచ్చ నోర్వడు. చిన్నప్పు

డు అల్లరిచిల్లరిగాతిరిగి చదువంటే శ్రద్ధలే కుండా వుండేవాడు. తండ్రి చిన్నప్పుడే చని పోయాడు. పక్కా రౌడీ అని పేరు పొందాడు. ఆవూరివారందరికీ అతనంటే మిక్కిలి భయం గాఉండేది. కొన్నాళ్లకు పెద్దవాడై వివాహ మాడి ఊరిపెత్తనమంతాచేస్తూ కులాసాగా కాలంగడిపేస్తున్నాడు. అన్ని యోగాలూ వు న్నాయిగాని, ఆతనికి సంతానయోగంమాత్రం లేకపోయింది. తనకు నలభైయేళ్లు పైబడ్డాయి. యింకా పిల్లలుపుట్టలేదు. నలుగురూకలిసి మెడత్రిప్పితే మంచికుటుంబములో నొకపిల్ల వాణ్ణి పెంచుకున్నాడు. ఆ పిల్లవాడి గుణాలు తండ్రిగుణాలకి వ్యతిరేకించాయి. తండ్రంతి కర్కోటకుడో కొడుకంత అమాయికుడు. వున్న ఆస్తి తింటే చాలని దత్తునికి చదువు చెప్పిం చలేదు జోగప్పగారు. కొన్నాళ్లకు జోగప్ప గారి భాగ్యం చూసి తన కుమార్తె కామేశ్వ రిని సోమన్నకిచ్చి పెండ్లిచేశాడు రామశాస్త్రి. మఱొక్క సంవత్సరంలో జోగప్పగారి భార్య అంతర్వత్ని అయింది. ఇంక జోగప్పగారికి పట్టుకుంది మనఃకించ "ఎందుకు దత్తత చేసు కొన్నానా" అని. "కానీ పుట్టేది ఆడదో, మగాడో తెలుసుకొని మఱీ ఆలోచిద్దాం" అని వూరుకున్నాడు. నవమాసములు నిండిన తరువాత దత్తుని దురదృష్టమో అన్నట్లు మగపిల్లవాడు కలిగాడు. అప్పుడు జోగప్ప గారి హృదయంలో హాలాహలం పుట్టింది. ఎంతయైనా కన్నవాడుండగా దత్తునిమీాద ప్రేమవుంటుందా? ఓబండి కట్టించి దత్తుణ్ణి అందులోకూచోపెట్టి జనకగృహానికి పంపే శాడు. దాంతో కన్నతండ్రి కామయ్యగారికి కోపమొచ్చింది. ఈతడుకూడ జోగప్పగారి కేం తీసిపోడు. కుక్కసంతానంలా తనింటి నిండాపిల్లలే. ఆస్తి చూస్తే నాస్తే. తనకొడుకు సోమన్నను దత్తతిచ్చి ఆరూపేణా వారింట బడి తింటూ క్రమేపీ ఆముసిలాళ్లిద్దరినీ గోవిందా అనిపించి సోమన్న పేరు మీాద దివాన్ గిరీ చలాయిద్దామనుకున్నాడు. జోగప్పగారు మాత్రం సామాన్యుడా! ఆస్తి రెండుభాగాలు చేయకుండా అంతాకన్న కొడుకేయిచ్చి దత్తుణ్ణి తగిలేద్దామను కున్నాడు. ఇల్లావుండగా నాలుగైదుసారులు సాక్షిగా దత్తుని విషయంలో జోగప్పనడిగాడు. కామయ్య. దానికి సమాధానం చెప్పకుండా దాటుకుపోతూ వచ్చాడు జోగప్ప. కాని కామయ్య వదలలేదు. నలుగురిదగ్గఱకూ జోగప్పను రప్పించి ధర్మశాస్త్రంతీయించాడు. దత్తతైపోయిన తరువాత తిరిగీ ఆపిల్లవాణ్ణి కన్నతండ్రి స్వీకరించకూడదనిన్నీ, దత్తత చేసుకొన్న తరువాత పుట్టిన ఔరసుడుచేయి క్రిందవేయి పెట్టవలసినవాడేననీ తేలింది. జోగప్పకు ముఖం మాడిపోయింది. తప్పని సరిగా సోమన్నను తీసుకుపోయాడు. కొన్నా ళ్లకు కామేశ్వరి వ్యక్తురాలైంది. సుభ ముహూర్తంలో కార్యంచేసుకొని తీసుకొచ్చి ఆభార్యాభర్తల నిద్దఱినీ వేఱొకయింటిలో వంచుకొనితింటూ వుండమన్నాడు జోగప్ప. రోజు వారీ భత్యం ఇస్తూండేవాడు వారికి. ఈ యువమాన మా నవ దంపతులకేం తట్ట లేదు. సోమన్నకసలు తెలియదు. కామేశ్వరి

తప్పులు వెదుకు స్వభావురాలుకాదు. సుగుణవతి. తండ్రి దగ్గిఱ పంచకావ్యాలూ చదువుకుంది. ఈ యుపమానమునంతేగా పాటిస్తుందా? తాను వచ్చిందిలగాయితు భర్త అమాయికత్వమునకు జాలిపడి ఆతనికి సర్వవిధాలా తోడునీడై వుంటోంది. నిత్యమూ సూర్యనమస్కారాలుచేస్తూ సూర్యారాధన తత్పరయై భర్తకు సర్వసుఖాలూ గలగచేస్తూ కాపరంచేస్తోంది కామేశ్వరి. కొన్నాళ్లకు ఆ దంపతుల ప్రేమ స్వరూపములో అన్నట్లు వో కుమారుడు ముగ్గుఱుకుమార్తెలూ కలిగారు. ఏకష్టాలులేకుండా కాలం గడిపేస్తున్నారా దంపతులు. అది జోగప్ప కిష్టంలేదు. "నాకొడుకుండగా వీడెవడు నాఆస్తి తిండానికి?" అని నిత్యమూ తన హృదయందురాలోచనలతో మలినం చేసుకుంటున్నాడు. కామయ్యకూడా వూరుకోలేకపోయాడు. సోమన్నను ప్రోత్సహించాడు ఆస్తిపంచుకోమని. సోమన్న మాట్లాడలేదు. ఆమాట్లాడకపోడం నచ్చిందికాదు కామయ్యకు. నలుగురిమధ్య అల్లరిపెట్టాడు. "నాకొడుకుని పెంచుకొని నానాకష్టాలు పెడుతున్నాడు" అని. జోగప్ప అవేమీ వినలేదు. అప్పుడు సోమన్నను పనుందని తీసుకుపోయి దావాపడేయించాడు కామయ్య. ఆదావాలో ఆస్తి మూడు భాగాలుచేసి ఓభాగం దత్తునికి వ్రాసివేయమని తీర్పుచెప్పారు కోర్టువారు. ఆ తీర్పుతో జోగప్ప అగ్గిరాముడై పోయాడు. ఆస్తి పంచకపోడంకాకుండా రోజువారీ భత్యంకూడా యివ్వడం మానేశాడు. కామయ్య యింక వుండలేక ఆస్తిపంచలేదని వారంటుపెట్టి గడబిడచేసి కోర్టువారితీర్పు ప్రకారంగా మూడోవంతు ఆస్తి సోమన్నపేర రాయించాడు. ఇన్నిచేస్తున్నా సోమన్నా, కామేశ్వరీకూడా జోగప్పగారింటికి వెళ్లడం మానేవారుకాదు. నిత్యమూ అత్తమామల క్షేమసమాచారాలు తెలుసుకొంటూ వారికి చేయవలసిన సేవలు చేసి యింటికివచ్చేది కామేశ్వరి. ఆస్తి దత్తునికి కూడా వ్రాసింది లగాయితు జోగప్ప వేఱాలోచనలో పడిపోయాడు ఎప్పుడూ ప్రయాణాలే. ఎప్పుడూ ఎవరితోనో గుసగుసలే. మఱికొంత కాలానికి దైవకృతంవల్లనో మానవకృతంవల్లనో ఓరోజు ఆడుకొంటున్న సూర్యనారాయణ (కామేశ్వరి పుత్రుడు) అటాత్తుగా నేలపడి మరణించాడు. కొంతసేపా పుణ్యదంపతులు విచారించారు. ఒకవారంరోజులైన తరువాత సూర్యనమస్కారాలు చేసుకొని భర్తను భోజనానికి పిలుచుటకు అతనిగదిలోకి వెళ్లింది కామేశ్వరి. ఇంకేం వుంది? భర్తరక్తం కక్కుకొని చనిపోయి వున్నాడు. తెల్లబోయింది ఆమె కళ్లు చీకట్లు క్రమ్మివేసినవి. ఇంక మారుమాటాడక, ఎవరినేనా పిలవక తన పూజామందిరంలోకిపోయి తొందఱగా అక్కడో పఱుపువేసి తిరిగి భర్త దగ్గిఱకు వచ్చింది. అతనిని మెల్లిగా భుజంమీద వేసుకొని తాను పఱచినపఱుపుమీద పడుకోపెట్టి తానుకూడ అక్కడే కూర్చుంది ధ్యానంచేసుకొంటూ. కొంతసేపటికి జోగప్పా మఱి కొంతమందీ యింట్లోకివచ్చారు. ఈ దృశ్యమును చూస్తూనే జోగప్ప దగ్గఱకువచ్చి

సోమన్న చెయ్యిపట్టి నాడిచూచి ప్రాణాలు పోవడం తెలుసుకొన్నాడు. లేనిదుఃఖం తెచ్చుకొని నిజంగా కుమారునికై విలపించు వాడిలాగనే విలపిస్తూ కామేశ్వరి నోదార్చు నెపమున ఆమెదగ్గఱకు వెళ్లాడు. అగ్నిహోత్రం దగ్గిఱకు వెళ్లినట్లే ఉపద్రవమైనవేడిమి తగిలింది జోగప్పకు. జోగప్పతో వచ్చినవారిలో నొకడు కామేశ్వరి ఉలుక్కుండా పలుక్కుండా వుండడంచూచి సమీపానికిపోయి చెయ్యి పట్టుకొని లేవదీయబోయాడు. అగ్నినితాకితే యేమవుతుందో అంతే అయింది ఆ పెద్ద మనిషికి. భయపడి యివతలకి వచ్చేశాడు. కొంతసేపటికి కూర్చునియున్న కామేశ్వరి పడిపోయింది మఱొకరోజువఱకూ ఆమెను ముట్టుకోడానికి జంకారంతా. ఎన్నాళ్లుంచుతారు అశరీరాల్ని? కొసకొకడు తెగించి తాకిచూచాడు చల్లగానేవుంది. అప్పుడు వారిని తీసుకొనిపోయి యథాశాస్త్రీయంగా దహనపఱిచారు. ఆ పుణ్యదంపతులు దహనమగుచుండగా ఆ చుట్టుప్రక్కలున్న తురావిపువ్వులు గంగరావిపువ్వులు గాలికెగిరి పడ్డట్టు కాష్టం మీదపడినవి. లోకవిరుద్ధంగా అరఫర్లాంగుదూరంలోవున్న పువ్వులు కాష్టంమీద పడినందుకు ఆశ్చర్యపోయారు జనం. అగ్నిహోత్రుడు పూర్తిగా ప్రజ్వరిల్లి అపుణ్యదంపతులను తనలో నైక్యం చేసుకున్నాడు. ఇట్టి పతివ్రతామణి మరణము గుఱించి కొంతమంది మఱొకవిధంగా చెపుతారు. పతిపుత్రులు చనిపోయినట్లే యీమె కూడాయేప్రయోగంవల్లనో చనిపోయిందని. అది నమ్మదగనిమాట. అగ్నిప్రయోగంవల్లనైతే ఎవరైతే ప్రయోగింపబడ్డారో వారిమట్టుకే దేహమంతా బొబ్బలెక్కివై చనిపోతారు. దగ్గఱకు పోవువారికి కూడ నదేస్థితి కలుగదు. అని తెలిసినవారంటారు. ఆమెను చంపుటకూడ ననవసరము. ఆమెకు ఆస్తిపై హక్కులేదు మనోవృత్తితప్ప. మఱియు ఆస్తికి హక్కుదారులగు పురుషులు మాత్రమే చనిపోయారు. కామేశ్వరియొక్క కుమార్తెలు ముగ్గురూ క్షేమముగానే వున్నారు. ఇంకొకచిత్రం కామేశ్వరికూతుర్లకు వివాహముచేయు సందర్భంలో ముగ్గురల్లుళ్లకూ కూడా కామేశ్వరీ సోమన్నలే కాళ్లుకడుగుతూన్నట్లు కనపడడం, ప్రేక్షకులు భయపడడం జరిగింది. దీన్నిబట్టి దెయ్యాలంటారేమో! అయినా యీ కథ నమ్మదగనికాలంలో ఇరవయ్యోశతాబ్దంలోనే జరిగింది గనుక ఎన్నోనామాటలు పుకలాయి. చెప్పడం మఱచాను. కామేశ్వరి చనిపోయిన వారంరోజులకే జోగప్ప ఔరసుడూ, మఱినెల్లాళ్లకు భార్యాకూడా పోయారు. అప్పటినుండి జోగప్ప దుఃఖం భరించలేక నిష్కారణంగా పుణ్యదంపతులను కష్టాలుపెట్టినందుకు విచారించి ఆ ముగ్గుఱు మనుమరాళ్లనూ దగ్గిఱుంచుకొని పోషించి కార్యాలుచేసి ఆస్తి ముగ్గుఱికీ పంచినాడు.

# పట్టు చీర

శ్రీమతి జి. యల్. భార్గవీ దేవిగారు

నాడు విజయదశమి. సాయంత్రం అయిదు గంటలయింది. నారాయణమూర్తిగారు హడావుడిగా యింటికొచ్చారు జేబులో ఓ చిన్నపాకెట్టుతో. అప్పుడే తల దువ్వుకొని మస్తాబు కాబోతున్నది హైమవతి. దశమిపండగకు తన కేదో తెచ్చారనుకుంది. సంతోషం కనబర్చకుండా కాళ్లకు నీళ్లిచ్చి కాఫీ యిచ్చింది. ఆరోజు కాఫీ రుచిగావున్నది మూర్తిగారికి. కాఫీ పుచ్చుకుంటూ "అత్తయ్యయే"దన్నాడు. "ఆలయానికి వెళ్లా"రంది హైమ. తెచ్చింది దాచిపెట్టటం దేనికనుకున్నారు కాబోలు హైమ చేతికిచ్చారు పాకెట్టు. విప్పిచూచుకుంది. చక్కని సిల్కుచీర. చూచేటప్పటికి హైమ అమితానందం పొందింది. నిజనాథుని కేసిచూస్తూ "పండుగరోజు. చక్కనిచీర. మిగిలిందేం"టంది నవ్వుతూ. అప్రయత్నంగా "నీవు కట్టుకోటం" అన్నారు మూర్తిగారు.

నారాయణమూర్తిగారు రామమూర్తిగారి ఏకపుత్రులు. కొద్దిపాటి భూస్థితిగలవారైనా పట్టుదలతో చదివించారు కుమారున్ని. పాపం అక్కడక్కడ మిక్కుటంగా పల్టీలుకొట్టినా చివరకు బి.యె.బి.యల్ అనిపించా డతనుగూడా. స్వగ్రామంలో కోర్టులేనప్పుడు ఎక్కడైతేయేం హైకోర్టులోనే ప్రాక్టీసు పెట్టుమన్నారు కొడుకును. మా అబ్బాయి హైకోర్టు వకీలని నోటారా చెప్పుకుందాం అనుకున్నాడు కాబోలు. పట్నం పిల్లవాన్ని ఒకన్నే పంపడం మనస్కరించలా. అందులో కోడలు చిన్నది గూడాను. పనంతా ఒక్కతే చేసుకోగలదా? తను కదల్టానికి వీల్లేకపోయింది! సరే పదిమందిపెట్టు పాయమ్మవుంది తీసుకపొ'మ్మన్నారు. పాయమ్మ పాపం చిన్నప్పుడే భర్తృవియోగం చెందింది. అప్పట్నుంచి అన్ననే కనిపెట్టుకొనివుంది. తెలివిగలది. చాకచక్యం గలది. కాబట్టి అంతా ఓ కట్టుబాటులో నడుపుకొస్తున్నది. వదినగూడా పనిలేని పాయమ్మ మాటంటే!

మరోగంటకల్లా పాయమ్మ దయచేసింది. శ్రవణానందంగా వాకిట్లోకే వినబడుతున్నది హైమ గొంతు. హార్మోనియంలో కలసి "పాకుపంట ఓ అరగంట ఆలస్యం అయితేయేం హాయిగా విందాం' అనుకుంది. సావిడిదాటి అలా గదికేసి చూచింది. కొత్తచీర కట్టుకొన్న హైమ మనోహరంగా పాడుతున్నట హార్మోనియం వాయిస్తూ. ప్రక్క పడకకుర్చీలో మూర్తిగారున్నారు. అంతా ఆనందమయం. సాయిగా వంటయింట్లోకిపోయి మడికట్టుకుంది. భోజనాలదగ్గర వస్తుంది గదా చీర ప్రసంగం, అత్తయ్యకు నచ్చచెప్తాం అనుకున్నాడు మూర్తిగారు. నాతో చెప్పకుండా కొనుక్కున్నప్పుడు నే నడగటం దేనికనుకుంది పాయమ్మ. హైమ అమాయికురాలు. పట్టుదలలోమాత్రం పాయమ్మకు తీసిపోదు. మాటవరుసన "పిన్నీ చూచారా మీ అల్లుడు గారు తెచ్చా"రంటూ పమిట చెంగుచూపింది. "తెచ్చేది వాడు కట్టుకునేదానివి నీవు మధ్య నాదేముంది" అంది పాయమ్మ. అన్నం ముందు కూర్చోబోతున్న మూర్తిగారు అవకాశం చిక్కింది అదే చాలనుకొని చంగున అందుకున్నాడు. "అది కాదు అత్తయ్యా పెద్దదానివి చూచి సర్టిఫికేటు యియ్య."

"పెద్దదాన్ని నా పెత్తనం పేలాలయినట్లుంది."

"నీ పెత్తనాని కేమె అత్తయ్యా నీవు నిరంకుశాధికారిణివి." ఇంత పెద్దమాట వుపయోగించానేమో మరి హైమవంకచూచి చిరునవ్వు

నవ్వారు మూర్తిగారు. ఆమె ఆ భావంలోనే సమాధానం యిచ్చినట్లుంది. పాయమ్మకు ఇదంతా నాటకంలా వుంది. అందులో మాటవస్తే గొంతుకోసుకుంటాననే రకంగూడాను. అసలే ప్రాక్టీసులేనివాడు. అందులో పెండ్లాంమాట విని యీ కరువుకాలంలో పెద్దవాండ్లకు తెలియకుండా ఖరీదుగల చీర కొని పెట్టేవాడా అనుకుంది. నిరంకుశాధికారిణిపంటం పైపెచ్చు నవ్వటం మరీ వుద్రేకం కలిగించినవి. నమిలి మింగుదామా నమలకుండానే మింగుదామా అనే ధర్మంలో పడ్డది. మొదటి దఫాకు మెల్లగానే పోనిద్దాం అనుకుంది.

"నే సర్టిఫికేటు యిచ్చేదాన్నా? ఈ దాగుడు మూతలు అంకుశంలేక నేగా. అయినా నా కెందుకు లే."

"అదికాదే లంకావారి చిన్నబ్బాయి కనపడ్డాడె యివ్వాళ. జ్ఞాపకంలేదూ యెవరో?"

"జూనియర్ ఫీజు బాకీవున్నాయనేనా. మన యింటికిగూడా చాలాసార్లు వచ్చాడుకాదూ మీతో మాట్లాట్టానికి."

పాయమ్మ కర్థమైంది. ఆయనిచ్చిన పైకం కాస్తా కర్చేసి చీర కొన్నాడనుకుంది.

"అయితే ఏం?" అంది.

"ఆయన చీరె లమ్ముతాడు. నిన్న యీవూరికి వచ్చాట్ట. ఇవాళ నాకు కనుపించాడు బజార్లో. బాకీ ఫయిసలుచేస్తేగాని వీల్లేదన్నా. నాదగ్గిర పైకం లేదు. ఉన్నదంతా కర్చేసి చీరలు తీసుకపోతున్నా నన్నాడు. కాదు కూడదంటే యీచీరె యిస్తా నన్నాడు. అసలే దివాలాకోరు అందుకని ఇదే పట్టు కొచ్చానే."

"అవును నిజమే టవున్లో యీమాటే అనుకుంటున్నారు."

"కాదంటావా? డబ్బిస్తే నీకు చెప్పనంటే అత్తయ్యా?"

"అయినా నా కెందుకులే. మీ యిష్టం. లేనిపోని ఆశలు కాకపోతే నాతోనే చెప్పేవాడవైతే నాకుచూపి మరీ—"

"నీవు లేవే అత్తా."

"చచ్చిపోలేదురా నాయినా హాయిగావుండే వాండ్లు 'ఆ' 'ఊ' అనేవాండ్లు లేకుండా. తెలివి తక్కువ ముద్దును కాదురా పండగపూటవా డెవడో వచ్చి పాతబాకీక్రింద నీ భార్యగారికి పట్టు చీర యిచ్చాడంటే నమ్మటానికి."

"నిజంగానే అత్తా నే నెన్నడేనా అబద్ధం చెప్పాను?"

"మీ పెద్దలకో నమస్కారం పూరుకోరా...... అది అడిగింది. నీవు తెచ్చిపెట్టావు. మధ్య నాదే ముంది బోడిపెత్తనం."

"అమ్మతోడు నే నడగలేదండి పిన్నీ."

"అమ్మతోడు మేనమామ. అంతటితో పూరుకో నిన్నెవరు పిల్చారు."

"నిజంగానె అత్తా అది అడగలేదే."

"వత్తాసీకి వచ్చావురా నాయనా. నెత్తి నెక్కించుకో నే వద్దన్నానా."

"పిన్నిగారూ! పండగపూటా యీ గోల."

"గోలేనే! నే వదిలితేనేగాని యీఫీడ వదలదు కదూ! ఎంత వంగనాచివే తల్లీ. ఆడించు. ఇంకా రెండురోజులు పోతే నన్ను నడిపిస్తావు. గోలమనిషినేనె మరి మా అమ్మ అసలే అమాయికురాలు. మా నాన్న అంతకంటే. ఇక నేనా—?"

"మా నాన్న సంగతి దేనికి, పట్టుమని పంచ తీని యెరుగడు మీ యింట్లో. వూరికే వాండ్ల వుసురు పోసుకుంటావు."

"పెడుదుగానిలే మా తల్లివి. ఇదంతా దానికే గాదూ. వాన్ని నీవాన్ని చేసుకున్నావు. బుట్టలో పెట్టి ఆడిస్తున్నావు."

"ఊరుకోండర్రా ప్రక్కవాళ్లువింటే పరువుపోతుంది. అత్తా! అన్నం పెట్టవే."

"అన్నం పెట్టమనకపోతే ఆ.........నోరు మూయించలేవు. సిగ్గులేదూ! దాన్ని నామీది కా విధంగా తెరిచి చూస్తున్నావు."

"పిన్నీ!......................అంటం మంచిది కాదు. మాటకుమాట వస్తుంది. ఆమాట తిన్నవారు మా వంశంలోనే లేరు.

"మా వంశంలో వున్నారా !"

"అత్తా! ఓ చీరమీద ఇంత రాద్ధాంతం దేనికి. పదయింది అన్నం పెట్టవే. ఇదుగో ఓయ్ నీవూరుకో."

"చీర! అలాంటిది దీని అమ్మ గట్టిందా? అమ్మమ్మ కట్టిందా? అన్నీ చెప్పుతున్నావ్. మా ప్రాణం తీయిస్తున్నావ్."

"మహాతల్లివి! నీవు కట్టావులే. మాటమాటకి మావాళ్ల నంటావు. ఎందరనన్నావో అనుభవిస్తున్నావు అథమూ శుభమూ లేకుండా. వారు తెచ్చారు. నే కట్టుకున్నా. మధ్య నీ కెందుకు ఈ కడుపుమంట?

"వారు నీవారు! ఏంశారలు చాపుతావె దొమ్మరి......."

"మీా రూరుకుంటారా లేదా. ఓసేయి నీ పెళ్లి ఆఫీసులో తూచో. అత్తా నీకు నమస్కారం పెడ్తా. నీవన్నా ఊరుకోవమ్మా. నలుగురూ వింటే నవ్వుతారు. ఇదుగో ఇంకా వెళ్లలేం ?"

ఆమాత్రానికైనా వా రూరుకుండేది. అటుయేడు ఇటుయేడు తరాలవారు బైటికొచ్చారు. మూర్తిగారి పుణ్యఫలంచేత చేతులుమాత్రం కలవలా. ఈగోలతో ఇంటివారి పిల్లవాడు లేచి యేడుపు ప్రారంభించాడు. వాళ్లూ మొదట తమాషాగా వింటున్నారుగాని శ్రుతి మించి రాగానపడగా కోపంవచ్చింది. తనయింట్లో వాళ్లూగూడా నేర్చుకుంటారేమో అనుకున్నాడాయన. ఎందుకయినా మంచిదని వచ్చి నోరుచేసుకున్నాడు. మూర్తిగారికి తల కొట్టేసినట్లయింది. ఆమర్నాడే తండ్రిగారికో మహాజరు పిటీషను పెట్టుకున్నాడు. ప్రాక్టీసు లేదు — ఇంట్లో తప్పూలతో చస్తున్నా — ఏదో ఓ దోవచూపమని ప్రార్థించాడు. రామమూర్తిగారు అన్నివిధాల ఆలోచించారు. ఇలాగైతే ప్రాక్టీసు, పేరు మాట ఏలావున్నా పిల్లవాడు చెడిపోతాడనుకున్నారు. తక్షణంవచ్చి తమకు దాపునున్న సబుకోర్టులో ప్రాక్టీసు పెట్టమన్నారు. తాముకూడా వుంటామన్నారు. బతికాముగా బాబూ అనుకున్నాడు మూర్తిగారు. రెక్కలు కట్టుకోని పట్నంనుంచి లేచారు. ప్రస్తుతం మాఇంట్లోనే లేండి వారు వుంటం. విశేషాలేమన్నావుంటే మరోతూరి వ్రాస్తా.

---

# దారిద్ర్యము

జి. జోసపుకవిగారు

దీపించునిర్మల తేజంబులుడిగించు, రక్తమాంసముల సారములఁబిండు
మానాభిమానసంపద గంగపాల్సేయు, భయపిశాచమునకుఁబట్టి యిచ్చు
నిండు చింతావారినిధిమధ్యమునముంచు, సాహసబీజంబు సమయఁజేయు
అతులపాపజ్వాల లంకురమెత్తించు పదుగురిలోనగుబాటుజేయు

బహుదురాలోచనుల కెల్ల పాడిపంట
అసదృశాహ్లాద జలనిధికౌర్వదహన
మనసమదౌర్భాగ్యమునకు నెయ్యపువయస్య
పృథివి వర్ణింపతరమె దారిద్ర్యమహిమ.

# తెలుగు నవరాత్రి ఉత్సవాలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

భాషాప్రయుక్తరాష్ట్రోద్యమాన్ని మును ముందుగా ఆరంభించిన తెలుగునాటికి నూతన రాజ్యాంగ నిర్మాణంలో ప్రత్యేక రాష్ట్రం సిద్ధించకపోవడం, యిదేసమయంలో సింధు ఒరిస్సా దేశాలు అప్రయత్నంగా ప్రత్యేకరాష్ట్రాలుగా యేర్పడిపోవడం, ఇందువల్ల పన్నెండువేల చదరపుమైళ్ల వైశాల్యం కల తెలుగుభూమీ, 3 లక్షల తెలుగులూ గల అయిదు తెలుగుతాలూకాలు ఉత్కళ రాష్ట్రంలో కలిసిపోవడం, ఒకప్పుడు రాష్ట్రోద్యమానికి పట్టుదలతో పనిచేసిన బొబ్బిలి రాజా సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు గార్లవంటి ఆంధ్రనాయకులు మనకు ప్రత్యేక రాష్ట్రంవద్దనే వాదానికి దిగడం మొదలైన కారణాలన్నీ కలిసి తెలుగువారి మనస్సులో ఒక విధమైన ఆవేదన కలుగజేసి మఱచిపోయిన రాష్ట్రాభిలాషను మరల రేకెత్తింప జేసింది. అందువల్లనే ఆంధ్రనాయకులు కోరినదే తడవుగ తెలుగుదేశమంతటా సభలు జరిపి తీర్మానాలుచేసి తమ రాష్ట్రాభిలాషను ఏకగ్రీవంగా వ్యక్తపఱిచారు తెలుగులు.

తెలుగు సంవత్సరాది తెలుగువారొక్కరికే పండుగ. తెలుగువాడు ఏదేశానఉన్నా ఈ పండుగ చేసుకొని వేపపూప్రసాదం తిని తీరుతాడు ఈ పండుగకు జాతిమతకుల వివక్షతలుగూడాలేవు. శైవులు, వైష్ణవులు, మధ్వులు, అన్ని సాంప్రదాయాలవారూ అగ్రజన్ములు మొదలు అంత్యజులవఱకూ అందఱికీ యిది ఉగాదిపండుగే. అందువల్లనే ఆంధ్రుల చిరకాలాభీష్టమగు రాష్ట్రోద్యమానికి తెలుగుయుగాదినాడే పునః ప్రాణప్రతిష్టచేసి తొమ్మిదిరోజు లీ ఉత్సవం జరుపుటకు యేర్పాటుచేయబడ్డది. సంవత్సరాదితో ఈ ఉత్సవం ఆరంభమై శ్రీరామనవమితో ముగిసింది. సంవత్సరాదితో ఈ యుత్సవం ఆరంభమగుట యెంతసమంజసంగా ఉన్నదో శ్రీరామజయంతినాడీయుత్సవము సమాప్తమగుటంత సమంజసంగా ఉన్నది. శ్రీరామనవమి ఒక మహాపర్వదినము. ఆనాడాంధ్రదేశమంతయు, పచ్చని తోరణాలతో మంగళవాయిద్యాలతో సీతాకల్యాణాలతో పానకం వడపప్పులతో ఉత్సాహతరంగితహృదయాలతో నిండి నిబిడీకృతమై ఉంటుంది. ఆంధ్రులెల్లరీవిధంగా రామసేవాతత్పరులై రామభక్తి భరిత హృదయులై ఉన్నదినముననే చిరవాంఛితమగు రాష్ట్రసిద్ధికిగూడా మనసారా ప్రార్థించే అవకాశం యిందువల్ల లభించింది. కనుక ఏవిధంగా చూచినా తెలుగు నవరాత్రి ఉత్సవాలు ఆమోదకరంగా ఉన్నవి. తెలుగు జనులకు ఆంధ్రోద్యమం ఆరంభమై యిప్పటికి దాదాపు యిరవైయైదేండ్లు. ఆంధ్రమహాసభపుట్టి యిరవైమూడేండ్లు.

ఆరంభదశలో అయిదారేండ్లు తీవ్రంగానే సాగింది ఆంధ్రోద్యమం. కాని వెల్లువవచ్చినప్పుడు పిల్లకాలువలన్నీ మాటుమణిగిపోయినట్లుగా అఖిలభారతోద్యమం అగు నిరాకరణోద్యమంలో ఆంధ్రోద్యమం సన్నగిలిపోయింది. వరదలో ఉన్నప్పుడు భూమిమీది మిట్టపల్లాలేమీ కన్పడనట్టుగానే నిరాకరణోద్యమంలో నిమగ్నులైన తెలుగులకు తమ మంచి చెడ్డలేమీ ద్యోతకం కాలేదు. కాని ఆ వెల్లువతీసిన తరువాత అఖిలభారతోద్యమంలో ఆంధ్రోద్యమం యేవిధంగా పేరులేకుండా సమసిపోయిందీ అందువల్ల యెన్నిమహత్తర ప్రయోజనాలు దిబ్బకొట్టుకపోయిందీ బాగా విశదమైంది. ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడు చేసుకోక పోవడంచేత కలిగే కష్టనష్టాలను ఆంధ్రులిప్పుడు తెలుసుకున్నారు. కాని చేయికాలిన వెనుక ఆకులకు వెతికినట్టుగా ఉన్నది ఇప్పటి ఆత్రం.

పుత్రుల ఉపేక్షాభావంచేత తెలుగు తల్లికిప్పుడు సర్వవిధాలా అరిష్టం చుట్టుకున్నది. ఉత్తరాన ఓఢ్రులు శిరోమకుటం తీసుకుపోయినారు. దక్షిణాన ఉన్న తమిళులు పాదపీఠం ఊడబీకాలెనని చూస్తున్నారు. పడమటనున్న కర్ణాటులు పార్శ్వభాగం కోసేసుకోవాలెనంటున్నారు. చుట్టూఉన్న సమీపస్థుల ఉద్ధతి ఈ విధంగా ఉన్నప్పటికీ తన బిడ్డలైనా ఒక్కటిగాఉంటే అమ్మకీ ఉమ్మలికం లేకపోను. తమది తెలుగుదేశమే కానట్టూ, తాము తెలుగుతల్లికే పుట్టనట్టూ, తమరు వాడేది తెలుగుభాషే కానట్టు భావించుకొని కూడిరాక తోడుపడక కలతలు పెట్టుకొని కాలక్షేపంచేస్తున్నారు పశ్చిమాన ఉన్న తెలుగుబిడ్డలు. తనబిడ్డలే తన్నిట్లు చీకాకు పరుస్తుంటె పరాయి వారిని పల్లెత్తి అనడానికేమి అవకాశముంటుంది తల్లికి?

తెలుగుదేశం ఒకచిన్న పరగణాకాదు. లక్షాయిరవై వేల చదరపుమైళ్ళవైశాల్యము గల 21, జిల్లాలు, రెండుకోట్ల ముప్ఫైలక్షల జనసంఖ్యగల పెద్దదేశము. తెలుగులచరిత్ర అతి ప్రాచీనమైంది. క్రీస్తుకుపూర్వము 27 సంవత్సరముల క్రిందటనే తెలుగువారు ఉత్తరం మగధదేశంవరకు తమరాజ్యమును విస్తరింపజేసి భరతవర్ష సార్వభౌములై విరాజిల్లినారు. తెలుగులు రాజ్యపాలనాదక్షులనీ, రాజనీతి దురంధరులనీ పేరు పొందారు. తెలుగు శకములు స్థాపించారు. విద్యాపీఠములు నెలకొల్పారు. శిల్పప్రావీణ్యతను ప్రదర్శించారు. ఇట్టి ప్రాచీనచరిత్ర గలది తెలుగుదేశం.

ఇంతకంటె తక్కువ వైశాల్యంగల దేశాలెన్నో యూరోపుఖండంలో స్వతంత్రరాజ్యాలుగా ఉన్నాయి. అట్టి సందర్భంలో ఇట్టి వైశాల్యము జనాభాగల తెలుగుసీమ ఒక రాష్ట్రముగా యేర్పడటానికి తగదూ అంటె హాస్యాస్పదమైనమాట.

ఉపేక్ష దేనికీ అనర్థకమే. అడుగనిది అమ్మైనా పెట్టదు. కనుకనే అందరికంటె ముందుగా భాషాప్రయుక్తరాష్ట్రోద్యమాన్ని లేవదీసిన తెలుగులు వెనుకనూ, తక్కిన

వారు ముందుగనూ, అయిపోయినారు. నిజంగా యిది ఆంధ్రులకు అవమానకరం అనడానికి సందేహంలేదు. కాని ఏమి చేస్తాము? గతము విచారించి ప్రయోజన మేమున్నది?

అయినా యిప్పటికీ తరుణం మించిపో లేదు. క్రొత్త రాజ్యాంగ పద్ధతి అమలు లోకి రాబోతున్నది. క్రొత్త ప్రభువు పట్టాభి షిక్తుడు కాబోతున్నాడు. ఈ క్రొంగొత్త సమయంలో తెలుగువారు తీవ్రంగా ప్రత్యేక రాష్ట్ర ప్రయత్నంచేసినట్లైతే శ్రీ పిల్లలమర్రి ఆంజనేయులు పంతులుగారు చెప్పినట్లు సార్వభౌములపట్టాభిషేకవరంగా ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రం సిద్ధింపవచ్చును. వెనుక జార్జి సార్వభౌముడు తన పట్టాభిషేకసమయంలో వంగదేశ విభజనను రద్దుపఱచినట్లు వరమి చ్చినట్లుగానే ఆంధ్రదేశమునుండి విడదీయ బడిన తాలూకాలు మరల ఆంధ్రదేశంలో కలిపివేయబడు వరము పొందవచ్చును. ఇంతకూ పిండికొద్దిరొట్టె. ప్రయత్నంకొద్దీ ఫలితమూ. కనుక అవి రామకృషి కావాలె ఈమనోరథం సిద్ధించడానికి.

వార్తాపత్రికలలో ప్రచురింపబడిన తెలుగు నవరాత్రి ఉత్సవాల ఉదంతాలు చూస్తే ఆశ కెక్షమిస్తున్నది. ఇది కేవలం పురుషుల పనిగానే ఉండిపోక స్త్రీల చిత్తంలో గూడా ప్రవేశించడం మఱింత సంతోషకరంగా ఉన్నది. ఈ సందర్భాన ఆంధ్రోద్యమానికి జన్మస్థానమైన గుంటూరుపట్టణంలో తెలుగు జాతీయతకు పుట్టినిల్లైన శ్రీమతి ఉన్నవ లక్ష్మిబాయమ్మగారిచే జరుపబడిన ఆంధ్రో త్సవం గమనించతగ్గదిగా ఉన్నది.

ఆ లక్ష్మిబాయమ్మగారు ఆయెద్దుల జోడా ఎక్కడ సంపాదించారో! ఆ తెల్లని ఆ నున్నని నునుపు; ఆచక్కని బలుపు; ఆ కొండలవంటి ఉన్నతము; ఆ గంభీరమైన చూపులు;ఆ హొయలు గులికేనడక;తళుకు తళుకుమనే పూసల పట్టీలతో మొగములూ శరీరములూ అలంకరించుకొని మెడలో ఘంటలు ఘణఘణా మ్రోగుచుండ ఆవృష భరాజములు రెండూ ఠీవిగా నికేతనావరణ లోనికి వస్తూఉంటే ఒడలు పులకరించి పోయింది. వాటిని చూచి లక్ష్మిబాయమ్మ గారు పొందిన సంతోషమూ నికేతన బాలికలు పొందిన ఉల్లాసమూ చెప్ప శక్యం గాదు.

సరిగా యేడున్నరగంటలకు కర్పూర నీరాజనములతో నారికేళఫల నివేదనలతో, మంగళవాయిద్యములతో జయజయనినాద ములతో బాలికల భజనలతో నికేతనా వరణమునుండి బయలుదేరింది ఆంధ్రప్రభ. ప్రభ చూచినదే తరువాయి అడుగడుగున పూర్ణజలకలశములు తెచ్చి వారబోసి,పసుపు కుంకుమలతో బసవదేవుల నర్చించి కర్పూర నీరాజనము లీయసాగినారు పుణ్యాంగనలు. ఒకవైపు ఆంధ్రప్రభా సమార్చనలూ దానికి మెట్టమొదట ఒకేరంగు దుస్తులు ధరించిన

పదేండ్లలోపు బాలిక లారుగురు వలయంగా యేర్పడి అడుగులు వేస్తూ

గౌతమీకృష్ణ వేణుల్ అశ్వరథ
నీర క్తనాళంబులై అశ్వరథ
ఉప్పొంగి ప్రవహింప అశ్వరథ
మేటిపన్నాటి వీరుల్ శరథ
బెబ్బులీ వీరబెబ్బులుల్ అశ్వరథ
నీ వీరసంతానముల్ దశ్వరథ లలలలల
శరథ దదదదదశ్వరథ

అని ఖడ్గాలు చెప్పడమూ వానికి తోడుగా వాసిరెడ్డి హనుమాయమ్మగారి జాతీయ గీతాలూ పాడడమూ ఒకదానికి ఒకటి తోడై ఊరేగింపును శోభాయమానంగా చేసినవి. ఆంధ్రులకు రాష్ట్రోద్యమంలో ముందు రాబోయెడి అడ్డంకులను సూచిస్తున్నదా అన్నట్లు వీధిని అడ్డుపడిన ఎలెక్ట్రిక్కు తీగల నిరోధములూ, వానజల్లులూ ఊరేగింపుతో వచ్చినవారికి కొంచెము బాధ కలిగించిననూ అకుంఠిత కార్యదీక్షా దక్షురాలగు లక్ష్మీబాయమ్మగారు ఆంధ్ర ప్రభోత్సవమును నిర్విఘ్నముగా సాగించి ధన్యులైనారు. ఫోటో తీయించుటతో ఉదయకార్యక్రమం ముగిసిపోయింది.

మధ్యాహ్నం సత్వరాంధ్ర రాష్ట్రసిద్ధ్యర్థం శ్రీ రామ పూజా భజన, వడపప్పుపానకములూ జరిగినవి. సాయంత్రము మహాసభ. శ్రీరామనవమి అగుటవల్లను వర్షావరోధంవల్లను సభకు వచ్చుట కష్టంగాఉన్న పురస్త్రీలుగూడా సభలో పాల్గొన్నారు. దైవప్రార్థన తులసీదేవి గావించెను. ఆంధ్రప్రశస్తి పద్యములు జదివిన పిమ్మట శ్రీయుత పిల్లలమర్రి ఆంజనేయులుగారు, శ్రీ పాలపర్తి నరసింహముగారు, పాలపర్తి రామమూర్తిగారు, కొండ పార్వతీదేవిగారు, అధ్యక్షురాలు ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు మున్నగువారు ఆంధ్రోద్యమాన్ని గురించి సాకల్యంగా ఉపన్యసించారు. తర్వాతసత్వరాంధ్ర రాష్ట్రసిద్ధికి యెల్లరు కృషిచేయవలయుననియూ, ఉత్కళరాష్ట్రేతరాంధ్రస్త్రీలుగూడ సభలు జరిపి ఈవిషయమై తీర్మానములు గావింపవలసినదనియూ మూడు తీర్మానములు చేయడంతో సభ సమాప్తమైపోయింది.

ఒక చిన్న హెచ్చరిక మాత్రంచేతనే ఆంధ్రనవరాత్రి ఉత్సవాలు అనుకొన్నదానికంటె యెక్కువగా జరగడం సంతోషించవలసిన విషయమే అయినప్పటికీ మనం సాధింపవలసిన ప్రత్యేకరాష్ట్రము, దానికున్న నిరోధాలనుబట్టి చూస్తే ఈప్రయత్నమేమాత్రం చాలదు. ఆంధ్రోద్యమ సారథ్యభారం ఏవొక్క ఆంధ్రనాయకులమీదా ఆధారపడలేదు. తెలుగువారందరిమీదా ఆధారపడి ఉన్నది. తెలుగుప్రాణి ఏదేశాన ఉండనీ, ఏరాష్ట్రాన ఉండనీ, ఏఖండాన ఉండనీ ప్రత్యేకరాష్ట్రంకొరకు కృషి చేసి తీరాలె. 2 కోట్ల 30 లక్షల ఆంధ్రప్రజా కంఠాలు ఒక్కకంఠంగా ఘోషపెడ్తేనేగాని ఫలసిద్ధి గలుగదు. ఆంధ్రులు ఒంటరిపాటున చేసుకోవలసిన పని యిది. ఇందులో పర రాష్ట్రీయుల సహాయముండదు సరిగదా నిరోధాలు అనివార్యంగా ఉండవచ్చును.

కనుక ఆంధ్రులెల్లరు జాతిభేదము, మత భేదము, కులభేదము, శాఖాభేదము, పక్ష భేదము విడిచి ఐకమత్యంతో అన్యోన్య సహాకారంతో సంఘీభావంతో కృషిచేసి కార్యసిద్ధి పొందాలె.

ఏనాడాంధ్రు లీ రాష్ట్రి సంపాదన యందు సఫలమనోరథులౌతారో ఆనాడు గాని ఆంధ్రులప్రతిభ దిగంతవ్యాప్తము గాదు. ఆనాడుగాని ఆంధ్రుల తేజోమయ చరిత్ర లోకానికి వెల్లడిగాదు. ఆనాడుగాని ఆంధ్రుల భూములు సస్యశ్యామలములై విరాజిల్లవు. ఆనాడుగాని పశ్చిమాంధ్రుల నీటికాటకం నశించిపోదు. ఆనాడుగాని ఆంధ్రులకు ప్రత్యేక న్యాయస్థానములు యేర్పడవు. ఆనాడుగాని ఆంధ్రస్త్రీలకు ప్రత్యేకకళాశాల లభించదు. కనుక యావదాంధ్రు లీవిషయంలో నడుంకట్టి పనిచేసి విజయసిద్ధిని పొందాలె.

ఆంధ్రోద్యమం ఏనాడో విడిచిపెట్టివేయడంచేత నేను దానిని మళ్లీ తలెత్తించాలంటే ఎన్నో కొఱతలు కన్పడుతున్నాయి. ఆంధ్రచిత్రకారు లెందరో ప్రజ్ఞాడ్యులై మన భారతదేశంలోనేగాక పశ్చిమఖండంలో గూడా కీర్తిని గడించారు. కాని ఒక్క ఆంధ్రమాత చిత్తరువు గీచినవారులేరు. మొన్న ఆంధ్రప్రభమీాద ఆచిత్తరువు లేక పోవడం ఎంతో కొఱత అనిపించింది.

అట్లాగే ఆంధ్రనాయకుల చిత్రపటాలు గూడా దొరకలేదు. ఈకొరత లెట్లాగన్నా సహింపవచ్చును గాని ఆంధ్ర జాతీయ గీతాలు లేకపోవడం, ఏ ఒకటో రెండో ఉన్నా అవి యెవరికీ రాకపోవడం మాత్రం భరింపరాని కష్ట మనిపించింది. జాతియొక్క ప్రబోధం జాతీయగీత గానంవల్లనే కలుగుతుంది. కనుక జాతీయాత్మగల కవు లీ గీతములు రచియించి, చిత్రకారు లీ చిత్తరువులు లిఖించి ఆంధ్రోద్యమానికి నవజీవం కలిగించాలె. తెలుగు నవరాత్రి ఉత్సవాలు యికముందు ఏటేట యింతకంటె వైభవంగా జరిగి ఆంధ్రాభ్యుదయానికి సాధన భూతం కావలెనని కోరుతున్నాను. భగవాను డనుగ్రహించునుగాక.

తెనుఁగుతల్లికి జే!



మిసర్స్ ఎం. ఎస్. శ్రేష్ఠ. మంగళూరు లేడీక్లబ్బు సెక్రెటెరీగా ఎన్నుకొనబడిరి. సిల్వరు జూబిలీ పతకము బడసిన ప్రథమ కెనరాస్త్రీ.



మిసర్స్ ఎన్. వెంకటరావు. మంగళూరు పురపాలక సంఘాధ్యక్షుడగు శ్రీ రావు బహదూరు ఎన్. వెంకటరావుగారి సతీమణి. మంగళూరు లేడీక్లబ్బు అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది.



మిసర్స్ జి. సెరి. మంగళూరు లేడీక్లబ్బు ఉపాధ్యక్షురాలుగా ఎన్నుకొనబడి, నిటీవల చదరంగపు పోటీలందు మిసర్స్ శ్రేష్ఠా గారి రజితపాత్రను బడసినది.



మిసెస్ కుసుం వి. ఠాకూర్,

పూనా మహిళావిశ్వవిద్యాలయ పట్టభద్రురాలు. ఇటీవలనే ఐయోవా విశ్వవిద్యాలయమున (అమెరికా) ఎం. ఇ. డిగ్రీ బడసివచ్చినది.



కీ. శే. గొట్టుముక్కల మంగాయమ్మగారు.



శ్రీమతి బి. కోటమ్మగారు,

కడప మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయులైన బి. వెంకటకృష్ణయ్యగారి సతీమణి. ప్రభుత్వమువారీమెను కడప డిస్ట్రిక్టు ప్రాథమిక విద్యాసంఘ సభ్యురాలిగను, సబ్ జెయిళ్లను దర్శించు నుద్యోగిగను నియమించిరి.

# సరస్వతీ రామాయణము

శేషాద్రి రమణకవులు

స్నేహలతాకవితాసంఘమునకు ఉపాధ్యక్షురాలగు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు సరస్వతీ రామాయణము రచించి భాషకు మిగుల సేవయొనర్చిరి. ఈ పుస్తకమును శ్రీ మీర్జాపుర సంస్థానరాజ్ఞియగు వెంకయ్యమ్మారావుగారు ముద్రణవ్యయములు భరించి చక్కగ నచ్చొత్తించి యాంధ్రలోకమున కొసంగి విద్యాప్రియత్వమును వెల్లడించిరి.

కవిసింహులు అవధానపంచాననులు నగు శ్రీ రాజశేఖర వేంకటశేషకవులు విపులమగు పీఠిక వ్రాసి గ్రంథప్రశస్తి వెలిఁగించిరి. పేరొందిన పండితులు పలువురు సదభిప్రాయము లొసంగిరి. గ్రంథాదియందు కవయిత్రి స్వరూపపటము భర్తృసుతద్వయ సహితముగఁ జేర్పబడినది. ముద్రణము ముద్దులమూటగట్టుచున్నది. వెల రు 1-0-0. ఇది స్నేహలతాకవితాసంఘమునందు నలుబదవ పుస్తకము. సంఘమును నెలకొల్పి తాఁజేయుటె కాక విదుషీమణులచే భాషాసేవఁ జేయించుచున్న సంఘాధ్యక్షులగు శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయకవిగారి భాషాభిరతియే ఈ యుత్తమ గ్రంథరచనమునకుఁ గారణము.

చేబ్రోలు సరస్వతీదేవిగారు పద్మనాయకవంశ (వెలమకుల) సముద్భూత. సంస్కృతాంధ్రములందె గాక అంగ్లమునఁగూడఁ బ్రవేశముగల సాధ్వి. ఈయమ భర్త రాజగోపాలరావుగారు. నూజవీడు ప్రకృత నివాసము. ఇంతకు మున్నీకవయిత్రి సరస్వతీశతకము సత్యనారాయణవ్రతకల్పము లోనగు చిన్న పుస్తకములు రచించెను. ప్రకృతమగు సరస్వతీరామాయణము ఉత్తరకాండ సహితము 1200 పద్యములుగల సత్కావ్యము. గ్రంథరచనమునకుఁ బ్రోత్సాహకులును గురువర్యులునగు రామసుబ్బరాయకవి యెడఁగల కృతజ్ఞత పద్యరూపముగ నీ క్రిందవిధముగ వెల్లడించినది.

తే.గీ. వాజపేయయాజుల వంశ వార్ధిసోము,
డైన శ్రీరామ సుబ్బరాయుని కరుణను
రామచంద్రుని చరిత నేవ్రాయఁగలిగి
గురువరుం డాతఁడే భక్తి గొలుతునతని.

గురువర్యుని యానతి తలదాల్చి యింతటి యుద్గ్రంథము రచించినందులకు సంతసించి యొసంగిన గురువాక్యములలోని యీక్రిందిపద్యము సరసముగనుండి శిష్యురాలియెడ గురునకుఁగల సోదరీభావమును వెల్లడించుచున్నది. ఇందుఁ బ్రయుక్తమగు సహజమాధుర్యమగు అమ్మాయను సంబోధనపదము కడుంగడు మాతృసూచకముగ నున్నది.

కం. "రామాయణము రచింపఁగ
దో మా యమ్మా యటంచు నూరకనీకున్
నే మును జెప్పినమాత్రన
సాహసముల్ ఋణముదీర్చినావు గదమ్మా."

చక్కని ప్రౌఢవాఙ్మయ సుబోధము నెక్కిన పుణ్యమూర్తి యని సరస్వతీ కవయిత్రిచేఁ బ్రశంసింపఁబడిన తద్విద్యాగురువగు వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారిట్టి యుత్తమగ్రంథప్రకటనముచే నాంధ్రలోకమునకు నుత్తమసేవ గావించిరనియే మా విశ్వాసము.

సరస్వతీ రామాయణమునందలి కవిత నిర్దుష్టముగా నున్నది. కవితాధార నిరర్గళముగనున్నది. చక్కని జాతీయప్రయోగములతో రచన చెవి కింపుగూర్చుచున్నది. పలుమారులు రామకథలు రామాయణములు చదివియున్నాము. రామాయణము ప్రాఁతకథయైనను ఈ నూతనరచనము హృదయంగమముగా మరలఁ జదువ నాసక్తి గలిగించుట యొకవిశేషము. కాననే కంకంటి పాపరాజకవి "రాఘవేశ్వరు చారిత్రము

సెంద తెన్నిగతులన్ వర్ణించినన్ గాలదే" యని ఉత్తరరామాయణమునందుఁ జేర్కొనినాఁడు. ఇంత వఱకు వెలువడిన యాంధ్ర రామాయణము లన్నింటిలో నొక్కొకదానియం దొక సుగుణముగలదు. కాననే యన్నియుఁ బ్రజాదరణపాత్రము లగుచున్నవి.

సరస్వతి కవయిత్రి రామాయణమునఁ గొన్ని క్రొత్తత్రోవలఁ ద్రొక్కినది. కొన్నియెడలఁ బ్రాచీన పద్ధతుల ననుకరించినది. ఇష్టదేవతాప్రార్థనముతోఁబాటు స్త్రీ సహజమగు భక్తివిశ్వాసములతో సాధ్వీకదంబమునకుఁ గవయిత్రి నమస్కరించినది. గ్రంథకర్త్రికిఁగల పాతివ్రత్యధర్మాభిరతియుఁ బతిపదసేవలందుఁగల భక్తివిశ్వాసములు సూచించుచు సాధ్వీధర్మము పతివ్రతాస్తుతియని దెలుపు పద్యము నిట నుదాహరించుచున్నారము.

"సతతము ధర్మచింతనయు శ్లాఘ్యతమంబగు శీలవృత్తులున్
ఋతమృదువాక్కు నెందుఁ జలియింపక నిల్చెడు దైవభక్తియున్
హితమగు రూపసంపదయు హెచ్చిన ప్రేమ రసంబు మీఱగా
పతిపద సేవలన్ మెలఁగు భవ్యచరిత్రల కేను మ్రొక్కెదన్"

ఇందుఁ బాతివ్రత్యధర్మమున కనుకూలములగు సుగుణములు చెప్పఁబడినవి. యోగ్యురాండ్రగు పతివ్రతామతల్లుల గౌరవజీవితము కతననే సర్వవిధముల వినుతినొంది భరతవర్షము ప్రపంచనాగరకతలోఁ దలకెత్తు గల్గుచున్నది. సంఘధర్మములు చెడి వివాహవిచ్ఛేదనాది పాశ్చాత్యధర్మములు విద్యాధికురాండ్ర దృక్పథమున కడ్డుపడు నీకాలమున నీకవయిత్రి ఇష్టదైవస్తుతితోఁ గలిసి పతివ్రతలకు నమస్కరించుట యెంతయు సమంజసముగనున్నది. ఆస్తికురాండ్రగు నిట్టి విద్యావతులు భాషాసేవతోఁబాటుగా నార్యధర్మములయెడ నభిమానమును జూపుట యొక విశేషము.

రామాయణ రచనమునందు సరస్వతీదేవి ఔచితి జాలవఱకుఁ గాపాడెను. లక్ష్మణుని సీత రాముని వెతుకఁబొమ్మను నపుడును, రావణుఁ డంతిపురి కాంతలతో విహరించి రాత్రి పరున్నవిధము ఆంజనేయుఁడు వర్ణించు భాగమునను, కాకాసురుని వార్త తెలుపలేక సీత లజ్జించు భాగమునను ఈ గ్రంథమునఁ బ్రస్తుతాంశము సంగ్రహముగ సరసముగ నున్నది. మొత్తముమీఁద గ్రంథమున వర్ణనాంశముకంటెఁ గథాకల్పనమునకే యెక్కువ యవకాశ మొసంగఁబడుటచేఁ జదువఁ జదువఁ జవులూరుచున్నది. పోనుపోను భాషయు నిరర్గళమై ఉత్తరరామాయణమున నొడ్డులనొరసి పాఱు ప్రవాహము ననుకరించి సరసముగానున్నది. భాషయుఁ గేవల సాంస్కృతిక దీర్ఘసమాసజటిలము గాక యలఁతిపదములతోఁ దెలుఁగుఁదనంబు తెలుపు నానుడులతో నింపుఁగూర్చుచుఁ బూర్వకవితను స్మరణకుఁ దెచ్చుచున్నది.

రామాయణము సంగ్రహించి రచించుటలో మొదటివాఁడు అయ్యలరాజు రామభద్రుఁడు. ఈయన కవిత రసవత్తరము. పోకడలు స్వాతంత్ర్యము వెల్లడించును. తెనుఁగుదనముకంటె సాంస్కృతిక భాషాజటిలమె ఈతని కవితలో గోచరించును. ఈ సరస్వతి రామాయణము తేటతెనుఁగు నీటులోఁ గావ్యయుగమున కొకవింత చెలువుగూర్చుచు రామాభ్యుదయకారుఁడు జూపనిసొంపు వెల్లడించుచున్నది. రామాభ్యుదయము కావ్యధర్మములుగలది. సరస్వతీరామాయణము పురాణధర్మోపేతము.

సీత రామునితో నరణ్యవాసమునకు వత్తు నను నపుడు ఈ కవయిత్రి ఔచితిబాగుగఁ బాటించి చెప్పవలసినది రెండు మాటలలోఁ జెప్పించినది. ఆమాటలు తిరుగఁజెప్పుటకు రామునకు వీలు గానివి. అప్పటి సీతా స్థితిని సమయోచితముగఁ గవయిత్రి పేర్కొన్నది.

"అమలశశాంకబింబముఖ మశ్రుకణంబులు నిండియుండ న
క్కమలసుగంధ రామపదకంజములంబడి యార్త చిత్తయై
నిమిషము నిన్నుఁబాసియిట నిక్కము నే వసియింపఁజాల నీ
సమముగ శోకభోగములసందడి నాకును భాగమీయవే."

సీతమాట కాదనుటకు రామునకు నోరు రాలేదు. కాని భయపెట్టి ప్రయాణప్రయత్నము మాన్పనెంచెను. అప్పుడు రామాయణము లన్నింటియందుంబలె నిందును రామచంద్రుఁడు చెప్పిన ప్రత్యుత్తరము కవులుపోయిన ప్రాఁద్రోవయే. అట్లయ్యు రసవత్తరముగానుండి సీతాసౌకుమార్యము అరణ్యవాసక్లేశమును గోచరింపఁజేయుచు నప్పటి పరిస్థితుల నద్దమునఁజూపినటులున్నది.

సీ॥ చంద్రశాలలయందుఁ జలువవెన్నెలగాదు
చండమార్తాండ ప్రచండలక్ష్మి
పసిఁడియుయ్యెలమీఁదఁ బండియూఁగుట గాదు
కాంతారకంటక కఠినభూమి
శుకశారికాకేకి పికకూజితము గాదు
కంఠీరవంబుల గర్జితములు
మృదువిపంచికమీఁద మీటుగానము గాదు
క్రూరరాక్షసుల సంక్షుభితరవము
తే॥ గీ॥ భీకరంబైన వనభూమిఁ బృథ్వితనయ
కుసుమసుకుమారి శేల గగ్గోలుపడఁగఁ
బురమునందుండు సుఖముగఁ బుణ్యచరిత
యుత్తమామలగొల్చుచుఁ జిత్తమలర.

తొలుత బమ్మెరపోతరాజిట్టి కల్పనను భాగవతమునఁ దావొసంగి తన కవితాశిల్పము సాటినాఁడు. చూడుఁడు.

సీ॥ సమదపుష్పంధయ ఝుంకారములు గావు
భీషణకుంభీంద్ర బృంహితములు.

ఈ కల్పనమునకు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారు క్రొత్తచెలువము దెచ్చి యచ్చంపుఁ దెలుఁగుందనమున దుజ్జీవింపఁజేసినారు. చూడుఁడు.

సీ॥ కదలుకొండలఁబోలు గజకాండములెగాని
గండుకోయిల పిండులుండవచట.

పద్యగమనమునందుఁ బ్రయోగవైచిత్రియందు పోల్కిగాని భావమునందు సరస్వతీదేవిగారి పద్యము మొదటి పద్యమునకు సరిపడు ప్రౌఢత రెండవ పద్యమున కీడుకోడగు తెలుంగుందనము నలవరించుకొని వింతగూర్చుచున్నది.

రావణునికడనుండి కృశించిన సీత యాకృతి, రాముని ధీరోదాత్తలక్షణము, లక్ష్మణుని సౌశీల్యము, ఉత్తరరామాయణమునగల సీత కరుణరసభూయిష్ఠమగు శూన్యజీవనము, రాముని మోహావస్థ లోనగు తావుల నీ కవయిత్రి స్వతంత్రరచనముతో నాయా రసముల నుజ్జీవింపఁజేసినది. కవయిత్రి వెలమయువతియు వీరవంశసంజాతయగుటచేఁ గాఁబోలు సంగరముల వర్ణించు భాగమునఁ గఱకుఁదనము జూపఁగలిగినది. ఆయా ఘట్టములలో నీవిషయమునఁ గవయిత్రి జూపిన నేర్పు పాఠకులు స్వయముగాఁ జూచుకొనగలరు.

సరస్వతీదేవి కవితలో భాష సారల్యముగానుండును. విషయము స్పష్టముగఁ బూసగ్రుచ్చి చెప్పుచున్నటులఁ దోఁచును. సీతను గోల్పోయి చిత్రకూటమున రాముఁడు విలపించు భాగమునందును, ఉత్తరకాండమున రాముఁడు సీతను వదలి శోకించు భాగమునను ఈ కవయిత్రి హృదయము కరుణరసతరంగితమయ్యెను. తత్ప్రతిబింబరూపములగు నీ భాగములు కడురమ్యములు. కాని సీతాసందేశము ఉత్తరకాండమున విచారభూయిష్ఠమగు జానకి దుఃఖజీవితమును దెలుపుచున్నది. ఇఁట సీతరామైకజీవిత. అనన్యశరణ్య. విచారపరితప్తహృదయ. అంతియగాని కంకంటికవి ఉత్తరకాండమునందుబలెఁ బరుషభాషిణి

గాదు. రామునకుఁ బూర్వస్మృతిఁ గలిగించి తన నిర్మలత్వము పాటుకొనుచుఁ బలుకులవాడితనము జూపు ప్రౌఢ కాదు. పాపరాజు రాజనీతివిదుఁడు. రసికసత్తముఁడు. పురుషచిత్తవృత్తికి ఎట్టి ప్రత్యుత్తర ప్రతీకార మవసరమో గమనించి కథ నడిపినాఁడు. సరస్వతీదేవి పాతివ్రత్యధర్మనిరత. భర్త్రాజ్ఞావశ్యానుసంధానమగు మృదుస్వభావ. కాననే సీతారాముల ప్రణయజీవితభంగమునకు వలవల కన్నీరు గార్చినది. ఉత్పత్తమగు నీయమ హృదయమునుండి వెలువడిన ప్రణయసందేశ మిది.

........................

మవ్వమున జంటఁబాయని గువ్వలకును
సారసంసార మెఱిఁగిన జాణలకును
ప్రణయబంధంబులోనున్న రసము దెలియు.

సీతను భూదేవి తనలోనికిఁ దీసికొనిపోయినది. ఇఁటగల రాముని శోకరసము హృదయదారణము. భారతములోని స్త్రీపర్వమును శంకరుని హరిశ్చంద్ర చరిత్రమున శ్మశానవాటికారంగమును జ్ఞాపకమునకుఁ దెచ్చి కనుల నశ్రుపూరితములొనర్చును. ఇఁట సైతము కవయిత్రి తన స్త్రీత్వమును బ్రకటించు రచనాసౌష్ఠవము మఱువలేదు. భూదేవి వచ్చి,

కురులు సవరించి చక్కఁగా విరులఁదురిమి
భూషణాదులఁ గైసేసి పొందుగాను
పీఠ మెక్కించి కొంపోయెఁ బేర్మిదవర
సీతఁ బాతాళమునకు భూమాత......

చిరకాలమునకుఁ దల్లి కుమారితను జూచినపుడు నెరులు సవరించుట, చెదరినపూలఁ జెక్కుట, భూషణముల ననువగు తావులఁ జేర్చుట సాజము. ఇది మాతృప్రేమ ప్రదర్శకమగు చిహ్నము. స్త్రీ హృదయమునకె ఇట్టి ప్రేమ గోచరించును. స్త్రీయే ఇట్టి మాతృప్రేమ గ్రహింపఁగలదు.

ఉపమానకల్పనమున నీ కవయిత్రి కొన్ని తావులఁ గ్రొత్తత్రోవలఁ ద్రొక్కినది. ఉద్యానవిహారమున సీతారాములు వర్తించు విధము అచటి వర్ణనము ప్రబంధశృంగారములోనికిఁ దిగినవి.

ఈ క్రిందియుపమానము లెంత సరసములో చూడుఁడు.

"మణినిబాసిన ఫణిరాజుపణములట్లు"
"చక్రవాకికి నును దెలివెన్నెలట్టుల"

ఇటులే కావ్యమునఁ గాంచిన కొలఁది గుణములే గోచరించును. శైలియుఁ బ్రకరణోచితము వివిధ భంగుల నడచినది. కొన్నితావుల శ్లేషములు దీర్ఘసమాసములు గలవు. కొన్నియెడల నుభయభాషలు సమముగ నడిచినవి. ఐనను పాకముమాత్రము బహిరంతస్స్ఫురద్రసమగు ద్రాక్షాపాక మనక తప్పదు.

గద్యమునందు "సకల కవీంద్రబృంద చాతకానంద సంధాయక చంద్రబింబాయమాన" అనుచోఁ జకోరానంద సంధాయక యనుట బాగుండునేమో. చంద్రకిరణములకు మోదించునవి చకోరములెగదా! ఈ కవయిత్రియుఁ జంద్రచక్రవాక న్యాయము విరోధ సూచకమని పేర్కొన్న యుపమానము పై నుదాహరించియుంటిమి. ఇట్టి స్వల్పదోషము లింకఁ గొన్ని యున్నవి. కాళిదాసు చెప్పలేదా, "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి" అని.

ఆంధ్రవాఙ్మయసేవ గావించు విదుషీమణులే యరుదు. అందు గ్రంథరచనము జేయువారు వ్రేళ్లపై లెక్కింపఁదగినవారుగ నున్నారు. అందు వెలమకులమునఁ గవయిత్రుల సంఖ్య చాల స్వల్పము. కొంతకాలముక్రింద విదుషియగు నొక వెలమరాజ్ఞి గ్రంథరచన మొనర్చి పేరే ప్రకటించుకొనలేదు. కారణము ఈ కులము వ్రేళ్లుపాఱిన గోషావామగోపనము జేయించినది. ఈ పరిస్థితులలో మున్నతవిద్యనేర్చి గ్రంథరచన మొనర్చుచు సాధ్వీధర్మమును బాటించు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి సేవకు అర్హతచాలని యీ కావ్యవిమర్శనము పారితోషకముగ నొసంగుచున్నారము.



# అతడు

# ఘనశాలి

# మహాబలశాలి

అందువనే ఆభారమైన కిరీటము;
సింహముపూన్చిన ఆరథము.

నేడు నీకా కిరీటము అక్కరలేదు;
సింహముపూన్చిన రథమక్కరలేదు

కాని నీకు ఆ బలము
మాత్రము అవసరము

నాడులేని పనులనెన్నింటినో నేడు
నీవు చేయవలసివున్నది.

ఇందుకు బలమైన నరాలు, పుష్టిగల
దేహము, ఉత్సాహమునిచ్చు ఉష్ణ
రక్తము కావాలి.

వీటిని నీకు ప్రసాదింపగలది—
నిన్ను నేటివీరునిగా చేయగలది
"అమృత" జీవనము.

బలహీనుని మహాబలశాలిగా చేయగలది

## అమృత

# బిచ్చగత్తె

"ఆచార్యుఁడు"

కృశించిన శరీరము, చీకాకై వ్రేలాడు కేశరాశి, వాడిన ముఖము, మానము కాపాడు నొక మాసిన చింకిగుడ్డ, చంక లో నిద్దరుబిడ్డలు ; పాపము ఆమె ఎండ వేడిమిని సహింపలేక చెట్టుక్రింద నిలిచి యుండెను.

మిట్టమధ్యాహ్నము. మూఁడు దినము లుగ తల్లి పిల్లల కాహారములేదు. పిల్ల లాకలితో మాడిపోవుచుండిరి అరచు చుండిరి.

'అమ్మా! బిచ్చమమ్మా.'

ఆమె పంతులుగారి యింటిముంగిలితో నిలిచి కేకవేసెను. జవాబు రాలేదు. మరల కేకవేసెను.

'బిచ్చం పెట్టండమ్మా!'

తలవాకిలి రెక్కలు మూసుకొన్నవి. పిల్ల లింకనూ ఏడ్చుచునేయుండిరి. ఆమె ముందుకు సాగెను.

ప్రక్కింటి ముంగిలిలో నిలిచి బిచ్చ మడిగెను. మొదట ప్రత్యుత్తరము రాలేదు. కాని, తుదకు మూసినతలుపుల తెరచు కొని యొక భయంకర స్త్రీవ్యక్తి వెలువడి 'ఎవరే అది? ముం—. వేళలేదు, వాళలేదూ, పో అవతలికి' అని బెదరించెను. ఆమె గడగడలాడెను. కళ్లలో నీళ్లు నిండినవి. తల వంచుకుని ఏడ్చుచున్న పిల్లలతో ముందుకు వెడలెను.

* * *

సాయంకాలము కావచ్చెను. పట్టెడు మెతుకులైనా దొరకలేదు. బిడ్డలు భుజము పైననే నిద్రించిరి. ఆమె నడువలేక కాళ్లీడ్చుకొనుచు ఆచార్యులవారి యింటి అరుగుపై కూర్చొనెను.

లోపల ఉన్నతాసనమున గూర్చుండి ఆచార్యులవారు రూపాయల నెంచుకొను చుండిరి. ప్రక్కన వారి కుమారుడు రాముడు కూర్చునియుండెను. భిక్షుకి కంట బడగనే రాముడు తలవాకిలికి పరుగెత్తి ఆమెను చూచుచు నిలబడెను. వాని మనసు కరగెను.

'ఎందుకమ్మా ఏడుస్తావు?'

ఆమె తలయెత్తి కన్నీళ్లు తుడుచు కొనెను. ఎదుట రాముడు నిలిచియుండెను. అతని నిండిన దేహమును సుందర ముఖమును జూచి ఆమె తన దుఃఖమంతయు మరచెను. మరుక్షణమే ఆకలితో మలమల మాడు తన బిడ్డల జూచినపుడు ఆమె కండ్లు చెమ్మగిల్లెను. 'రామునివంటి బిడ్డలతో దేశము నిండని' మ్మని ప్రార్థించెను.

'నాయనా! పిల్లలు ఆకల్తో చస్తున్నారు. ఏమైనా తిండి పెడ్తావా?'

రాముడు లోపలికి పరుగెత్తెను. కాని కొంతసేపటికి ముఖము వ్రేలవైచుకొని బయటికి వచ్చెను. వాని తల్లి వానిని తిట్టి పంపియుండెను.

నిద్రించుచున్న పిల్లలులేచి ఆహారము నకై తల్లిని పీడింపసాగిరి. ఆమె వారిని ఓదార్చ బ్రయత్నించుచుండెను. తల్లి పిల్లల దుఃఖము గని రాముని కన్నీళ్లు వరదలై పారెను.

వానికి ఏమి చేయుటకును తోచ దయ్యెను. 'నాయనగారితో చెప్పుదునా' యని తలచెను. కాని నాయనగారి యుగ్ర స్వభావము స్మృతికిరాగానే భయపడెను. వెంటనే అతని కొక యాలోచన తోచెను. ముఖము వికసించెను. లోపలికివెల్లి కాగిత మున 'దేనినో' చుట్టి ఆమె ఒడిలోవేసి 'ఎక్కడికైనా వెళ్లు' అనెను. ఆచార్యులు గారు రాముడు భిక్షుకితో మాటలాడు టను చూచి తిట్టిరి. వా డేమియు నెరుగ నట్లు వెళ్లి వారి ప్రక్కన కూర్చుండెను. భిక్షుకి వెడలిపోయెను.

ప్రొద్దు గ్రుంకెను. చీకటిపడెను. ఆమె యొక ఊరిబయటి పాడుగుడిలో కూర్చుని రాము డిచ్చిన కాగితపు పొట్లమును విచ్చెను. వెన్నెలతో నలిగిన యొక బంగారు కడియమును, నాలుగు కాసులను చూచెను. రాముడు తనవద్దనున్న నాల్గు కాసులను వారి యాహారమునకు చాలదని తనచేతి బంగారు కడియమునుగూడ నిచ్చి యుండెను.

రాముని యౌదార్యమును మెచ్చు కొనెను. కాని, గుట్టు రట్టయిన రాముని గతి ఏమౌననుట యోచించినపుడు చాల భయకంపితమయ్యెను. పిల్లలను నిద్రవుచ్చి ఆచార్యుల యింటివైపు వెళ్లెను.

రాముడు బయట నుండలేదు. వానిని పిలువ నామెకు ధైర్యము చాలదయ్యెను. మరుదినము ఇవ్వవచ్చునని వెనుదిరిగెను. పోవునపుడు నాలుగు కాసుల పండ్లు కొని పిల్లలకిచ్చి తాను మాత్రము కొంచెము నీరు త్రావెను.

మరునాడు ఉదయము రాముని చేతి యందు బంగారుగాజు కనపడకుండుటచే, తల్లి వాని తండ్రికి కెరింగించెను. వారు రాముని యడిగిరి. 'వాడు నే నేమియు నెరుగ' ననెను. గాజు నెవరో దొంగిలించి రని తీర్మానమయ్యెను. ఇంటిపనివారి నంద రిని విచారించిరి. కాని, గాజు దొరకలేదు. వెనుకటిరోజు రాముడు భిక్షుకితో మాటాడునది ఆచార్యులవారి స్మరణకు వచ్చెను. భిక్షుకియే రాముని మోసగించి బంగారుగాజును దొంగలించినదని వారు నిశ్చయించిరి. పోలీసువారికి సంగతి నెరి గించిరి.

* * *

ఆమెను పట్టుకొని శోధించిరి. బం

గారు కడియము దొరికెను. ఆమెను చుట్టును జనులు మూగిరి. గడబిడ యారంభమయ్యెను.

'గా శెక్కడిది?'

'చెప్ప ముం...'

'రాముణ్ణి చంపాలనుకుంది.'

'గాజుమాత్రంతీసి పుణ్యం కట్టుకొంది.'

'ఎక్కడ చైచెలాకి చూపుదామా అని తిరిగే దీనిని చూచిన మొదట్లోనే నాకు అనుమానం.'

'ఇంకా ఏమిచెయ్యా లనుకుందో?'

'ఎక్కడినుంచి వచ్చిం దీ మహామారి.'

'బిచ్చగత్తె వేషంతో ఉండే రాక్షసి.'

'కొట్టు.'

'పోడు.'

'నరకు.'

'పిల్లలను చంపే నరపిశాచి.'

* * *

భిక్షుకి శరీరమునుండి రక్తము ధారలై ప్రవహించెను. బిడ్డలు ఒడిలోనే మూర్ఛ పోయియుండిరి. ఇట్లున్నను ఆమె రాముని యందు తప్పు మోపలేదు. మోపదలప లేదు. రాముని పిలిపించిరి. వాడు సత్యము నుడివినను నమ్మువారెవరు?

మరుదినము పోలీసులు ఆమెను న్యాయ స్థానమునకు గొనిపోవ 'ఠాణా' వాకిలి తెరచిరి. ఆమె పిల్లలను రొమ్మున కదుము కొని పరుండియుండెను. వారు ఆమెను పిలచిరి. తట్టిలేపిరి. కాని, పిల్లలతోకూడ సత్యలోకమునకు జేరిన ఆ నిరపరాధిని వారికి బదులు పలుకునా?

(అనువాదము)

## కావలెను

మునుపటివలెనే "గృహలక్ష్మి"కి పెక్కు సోదరీమణులనుండి రచనలు వచ్చుచున్నందులకు మా కృతజ్ఞతావందనములు. ఇకను వారిని కథలను, పద్యములను, పాటలను, స్త్రీలకు సంబంధించిన వివిధ విషయములుగల వ్యాసములు గావలెను. వ్యాసములు విడివిడి కాగితమున ఒకే ప్రక్కన వ్రాసిపంప వేడికోలు.

సంపాదకుడు

# బాలవిజ్ఞానశాఖ

## పూలసంధ

అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

(ఒకపల్లెటూరి బాలికవద్ద సంపాదించితిని)

పొద్దున్నె ప్రొద్దున్నె లేద్దామా?
అందుగల పూవులు కోద్దామా?
కోసినవి రాసులు పోద్దామా?
సాలింటికాడ సన్నదారం తెద్దామా?
దాసరింటికాడ సన్నసూది కొందామా?
అన్నిటినిదండలుగ గుచ్చుదామా?
దేముడిగుళ్లోకి పోదామా?
కిరకిరతలుపులు తీద్దామా?
దేముడు మెళ్లోను వేద్దామా?

---

తాత
సీత
ముంజికాయమూత
కొడవలెట్టికోత
ఠానాకురాత
శ్రీరామదూత
లంకదరిమేత
గోదావరీత
గరిటికాల్చివాత
తాడిచెట్టుకీత
సీసంకాల్చిపోత
లంకలోని సీత
భరతమాత
కోడికూత

శ్రీమతి చావలి లక్ష్మీనరసమ్మ

## క్షుద్బాధాపీడితుడగు నొక అరబ్బీసంచారి తన కాహారమును సంపాదించుకొనిన విధము

శ్రీమతి డి. కమలావతి కన్యగారు

మక్కాకును సిరియాకును నడుమనున్న ప్రాంతములలో వర్తకము సేయుట కలవడిన యొక అరబ్బీ వ్యాపారి గొప్పలాభమును కైవశము చేసికొను నుద్దేశముతో ప్రయాణము చేయుచుండెను. కొంతకాల మొకస్థలమునుండి వేరొక స్థలమునకు దిరుగుచు నుండి ప్రయోజనమేమియు గాన్పించనందున నిరాశ చేసికొని వచ్చినత్రోవనే మరలెను. యెడారి దాటుటకు కొన్నాళ్లు బట్టెను. తుద కిల్లుజేరుట కింకొక్క దినపు బ్రయాణము చేయవలసియుండెను. ఆసమయమున విశ్రాంతికొఱ కొకస్థల మేర్పాటుచేసికొని, నడుముదట్టికి బిగించియుంచిన సంచినిదీసి, యందుండి రొట్టెను యెండిన చేపలను వెలుపలకిదీసి భుజింప బోవునంతలో ఆ యిసుకభూములందు భుజించినచోట పరుండక పరుండినచోట భుజించక నిత్యసంచారము చేయుచుండు నొక అరబ్బీయుడు తన కట్టెదుట ప్రత్యక్షమై, భోజనపదార్థముల గాంచినంతనే ప్రాణము లేచి వచ్చినటుల దోప, వర్తకునికి నమస్కరించి నిలువబడెను. వర్తకుడు నమస్కార మందికొనిన పిదప యీప్రకారముగా వారలకు సంభాషణ జరిగెను:—

వర్తకుడు— నీ వెవ్వరివి? ఇచ్చట యేల నిలుచుండియున్నావు?

బాటసారి—అయ్యా! నేను నీ గృహసేవకుడను. నీకొఱకై యెడారి దాటివచ్చితిని.

వర్త—నా కుటుంబస్థులనుండి యేదేని వార్త గొనివచ్చితివా యేమి?

బాట—అవును.

వర్త—శరే! నా కుమారుడు అహమద్ యేలాగున్నాడు? వాని వియోగము నా కాలేయమును మాడ్చి వేసినది.

బాట— అల్లా యనుగ్రహమువలన వాని సౌందర్యప్రభలు మిగుల తేజరిల్లుచున్నవి.

వర్త—అహమద్ తల్లి యేలాగున్నది?

బాట—అహమద్ కన్నను కుశలతరముగా.

వర్త—నాగృహ మెటులున్నది? దానినుండి దూరమైన కారణమున నా కెన్నియో యాపదలు గలిగినవి.

బాట—మిక్కిలి విభవముతో గూడిన నీ భవనము దేవతల ప్రభువున కీర్ష్యగొలుపుచున్నది.

వర్త—అధిక భారమును సునాయాసముగా మోయగల నాయొంటె యేలాగున్నది? దాని విడిచి వచ్చిన కారణమున నే నెంతో కన్నీరు గార్చవలసి వచ్చెను.

బాట—అది మిక్కిలి బలిసినందున దాని వీపు మూపురములు సమమట్టముగానున్నవి.

వర్త—నా గృహమును కనిపెట్టుకొనియుండు నా ప్రియమైన కుక్క యెవ్విధమునున్నది? నా కంటికది సింహమువలె గాన్పించుచుండెడిది.

బాట—దివారాత్రము లది యేమరక నీ యింటిని గనిపెట్టుకొనియుండును.

పై జవాబులమూలమున మన స్థిమితము గలుగగా యెదుటనున్న భోజనవస్తువులను నిర్విచారముగా వర్తకుడు భుజింపసాగెను. కడుపు స్థలమిచ్చు కొలది భుజించి యాతరువాత తిరిగి సంచిని బిగించు యత్నములోనుండెను. బాటసారి యది జూచెను. ఆ క్షణముననే దిబ్బందలరేఖ సమీపమున తటాలున మెఱుపుమెఱసి వట్లంతలో యగుపడి తిరిగి యదృశ్యమైన యొక జింకపిల్లను జూచెను. ఒక్క దీర్ఘనిశ్వాసము విడిచెను. తిరిగి సంభాషణ జరిగెను.

వర్త—యేమైనది?

బాట—అయ్యో! నీ కుక్క బ్రతికియేయుండిన ఆ జింకపిల్లలను చంపక విడిచియుండునా యని విచారించుచున్నాను.

వర్త—ఏమనుచున్నావు? నా కుక్క ప్రాణములతో లేదనా? అదెటుల మరణించినది.

బాట—నీ యొంటె మాంసము నధికముగా దినుటవలన.

వర్త—నా ప్రియమైన యొంటె నెవరు జంపిరి? నా నెత్తిన దుమ్ముబోసిన దెవరు?

బాట—చనిపోయిన నీభార్య యాత్మశాంత్యర్థమది వధింపబడెను.

వర్త—అయ్యో! అయ్యో! ఇక నేమున్నది? నాభార్య యేకారణమున మరణించెను?

బాట—తన గారాబు పుత్త్రుని చావువార్త విని దుఃఖమాపజాలక తలనొక బండకు గొట్టుకొని చచ్చినది.

వర్త—నే నెంత యదృష్టహీనుడను! అహమ్మద్ చావునకు కారణము దెలుపగలవా?

బాట—నీ ఇల్లాతని నెత్తిపై గూలినది.

ఈ దుర్వార్తాపరంపర నాలకించుటద్వార, మనస్సు చెదర, వర్తకుడు నెత్తి మోదుకొనుచు, దుమ్ము జల్లుకొనుచు,బట్టలు చింపికొనుచు గృహోన్ముఖుడై పరుగెత్తెను. సంచిని వెనుక విడిచెను. మన బాటసారి గోరినదదియే. తక్షణమే దాని గైకొని మిగిలిన యాహారమును తృప్తిగా భుజించెను.

(జ్ఞానరత్నములను ఆంగ్ల గ్రంథమునుండి)

# సజ్జన మైత్రి

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

కమల యీజీచేరులో కూరుచుండి పుస్తకమును చదువుచుండ ప్రక్కయింటిజానకి చాపమీదకూర్చొని ఆకులు కుట్టుకొనుచుండెను.

కమల—జానకీ! యీపుస్తకంలో స్నేహము అను శీర్షికగల భాగమెంత హృదయస్పర్శంగా వున్నదో చూచితివా?

జానకి—చూచితిని. ఆకథాపురుషుడు తనస్నేహితుని కష్టములనుదీర్ప తన సర్వస్వమును వెచ్చించి తుదకు వాని నున్నతస్థితికి దెచ్చి కృతప్రయత్నుడయ్యెనుకదా.

కమల—ఔను. స్నేహమన నట్లుండవలె. తక్కినవి ముఖప్రీతిస్తోత్రములు. బూటకపుమర్యాదలు. అట్టి యతి వినయము లెన్నటికిని కష్టములం గడుపనేరవు. ఆడాంభికస్నేహములకే 'శుష్కప్రియములు శూన్యహస్తములు' అను పేరు వచ్చినది.

జానకి—ఔనమ్మా! యీకాలమున నెటజూచినను అట్టి మర్యాదలే జాస్తి. మనోవాక్కర్మములచే మైత్రి బాటించి యాదరించు మీవంటి మనీషావతులు నూటికొక్కరుందురేమో.

కమల—అదేమిమాట నీకు నేనేమి యుపకరించుచుంటిని. పాపము పేదరాలివి. పిల్లలతో నీవుపడేబాధ చూడలేకున్నాను.

'అమ్మా టిఫిను తయారైంది' అని లోపలినుంచి కేక.
కమల—జానకీ! లోపలికిరా.

జానకి—పిల్లలు గోలపెట్టుచున్నారు. యింటికి వెళ్లుచున్నాను.

కమల రాజమండ్రిలో గొప్ప న్యాయవాదులైన మాధవరావుగారి సతీమణి. భాగ్యమా ఒకగొప్పజమీందారంత. సంతానం లలితయను నొక్కబిడ్డ. అల్లారుముద్దుగా పెంచుకొనుచుండిరి.

జానకి ఒక పేదకుటుంబిని. సత్కులప్రసూత. విద్యావతి. భారత భాగవతాది పుణ్యకథలంజదివి చక్కగా నుపన్యసింపగలదు. తాను పూర్వాచారపరాయణుల యొద్ద పెరిగినను నవీను లంగీకరించు సదాచారములన్న నామె కభిరుచి మెండు. స్త్రీలకు విద్య అవసరమనియు బాల్యవివాహముల ద్రోసి వాటి విషయమున స్త్రీలకును పురుషులతోపాటు స్వతంత్ర మొసగుచు యువతీవివాహములొనర్పదగుననియు నామెవాదము. చేతగాని పిన్నమ్మ మూతి విరుగబొడిచినట్లు ఓ యను నక్షరమున కెన్ని వంకరలో యెరుగని మూర్ఖాచారపిశాచబంధువు లామెనుచూచి మోపిరాల్చిపోసేవారు. లెక్చర్లిచ్చి ఉద్యోగాలేసి ఊళ్లేలుతుందని అధిక్షేపించేవారు. అవంతా ఆమె లెక్కజేయలేదు. అంతస్తు తగ్గియుంటే ఆచారాలంతా మంచివైనా అందరూ యేదో యొకవిధంగా త్రోస్తూవేవారే. అతిశయంగా వుంటే అందరూ అనుసరించేవారే. సజ్జనులైతే మైత్రే పాటిస్తారుగాని కేలెత్తరు. అట్టివారిప్పటికీ వున్నవారే. ఒకటిరెండు కుటుంబాల శ్రీమంతులామెపై యభిమానముంచి మైత్రి పాటించుచుండిరి. వారిలో కమల ముఖ్యురాలు. ఆమె పరోపకారశీల. నిర్దంభజీవన శాంతస్వభావ. ఆమెకు జానకియంటే పంచప్రాణం. యెన్నివిధముల సహాయపడేది.

ఐనా 'ధనపతిసఖుడై యుండియు నెనయంగా శివుడు బిచ్చమెత్తగ వలసెన్.' 'తనవారికెంతగల్గిన తన భాగ్యమెతనకు' అనిన సుమతి పల్కులవలె ఆమె కష్టములు గడచువిధమగుపడలేదు. జానకికి శ్రీహరి, రాఘవుడు, గోవిందుడు, పద్మ అను నలుగురుపిల్లలు.

దైవవైపరీత్యముచే నామె అనాధయైనది. సంసారభారమంతయు ఆమె తలయందే పడినది. ఐనను నారు

బోసిన దేవుడు నీరుబోయడా అను ధైర్యంతో నామె యెటులో కాలముగడపుచుండినది.

శ్రీహరి—అమ్మా! రేపు శ్రీరామనవమి పండుగ గదూ. దేవుడికీ మాకూ యేమన్నా చెయ్యవూ.

రాఘవుడు—నిన్న యుగాదిపండుగకు చేసిపెట్టింది. పాపం ఆకోదవ రేపునవమికి చేసిపెడుతుంది?

గోవిందుడు—అమ్మకు కుళ్లుబోతుతనంరా అన్నయ్యా యేమన్నాచేస్తే మనం దింటామనీ.

పద్మ—కాదురా! నోరే అన్నయ్యా చాటుగా తీసుకొని అంతా అమ్మే తినేస్తుంది మనకుపెట్టితే ఐపోతుందనీ.

జానకి—పోనీ నా చిట్టితల్లీ యీ మాటలంతా యెప్పుడు నేర్చుకున్నావే చేతిలో యేమీ లేదు. నేనేం చేసిపెట్టేది.

రాఘవుడు—ఎప్పుడడిగినా లేదూ లేదూ. ఇంకెప్పుడుండేది.

జానకీ—యెప్పటికీ యింతే. నిర్భాగ్యురాలిని నన్నెందుకు పీడిస్తారు.

గోవిందుడు—ఇంకెప్పటికీ అడగంగ నీ నాలుగు గారెముక్కలైనా చేసిపెట్టమ్మా. నిన్న చిన్నిచెల్లా యీనేనూ యెదుటింటి రత్నంతోగూడ ఆడుకొంటూ వుంటే వాళ్లమ్మ ఆ అమ్మాయికి జీడిపప్పూ పంచదారా తినబెట్టుతూ మమ్మల్నిజూచి మురికిగుడ్డల తోటి మానిముంతల్లాగ మాపిల్లని ముట్టుకోకండి. వెళ్లండని తలుపుమూసుకుంది.

రాఘవుడు—అందుకేనమ్మా చెల్లాయి గోవిందూ వాళ్లింటినించి నిన్న యేడుస్తూవచ్చారు.

జాన:—అయ్యో దేవుడా! మ్రొక్కనెత్తిన చేతులపై మొత్తిభిరుగగొట్టినట్లు అమాయకులై ఆడబోయిన పిమీదనా అభాగ్యశాలిని తన యైశ్వర్యగర్వం చిరాకు చూపింది. జౌను అనుభవపూర్వకముగా కష్టసుఖములు కలిమిలేముల పరివర్తనములు గుర్తెరిగి ప్రపంచస్థితి బాగుగా కన్నుగలిగి చూచువారు ఇతరుల వంత కఠినముగా తృణీకరించరు. అట్టివారిసంఖ్య నూటికొక్కవంతు. తల్లీ ఆడుకొనుటకిక పొరుగిండ్లకు వెళ్లకు. వారికి నౌకరుల వ్రాడిగాలకంటే నీకు సోదరుల ప్రేమను ధన్యతమమైనది. వారి నౌకర్లభక్తి ద్రవ్యమిస్తే వచ్చినది. నీకో సౌభ్రాతృత్యభాగ్యమె దైవమనుగ్రహించెను. అన్నయ్యలతో నాడుకొండువుగాని మరియొకరి పంచలకేగకు.

శ్రీహ—సాగరుబోతువాళ్లు బాలలను తిరస్కారంచేస్తే దేవుడు కోపిస్తాడని యెరుగరు. పంతులుగారు చెప్పినట్లు అధికారరోగంవచ్చి బధిరులు అంధులు ఐనారు.

గోవిం—అమ్మా వాళ్ల రత్నం వాళ్లను యెత్తుకునేటందుకు వీధుల్లో తిప్పేటందుకు దాదులున్నారే. మా కేదీమరీ.

జాన—నాయనా. వాళ్లకిచ్చాడా దేవుడంతా. మనకివ్వలేదు.

రాఘ—ఆదేవుడు పక్షపాతబుద్ధికలవాడు. ఆయనను నమ్మనేగూడదు.

శ్రీహ—ఛా అట్లనరాదు. సృష్టికే వేవిధంలో వాళ్ల నొకవిధంగా మనల నొకవిధంగా యేమైనా చేశాడా ఆ దేవుడు.

గోవిం—అంటే మాకు తెలియలే.

శ్రీహ—కాళ్ళూ చేతులూ ముక్కూ కళ్ళూ నోరూ తలా వొళ్ళూ యివన్నీ వాళ్లతోపాటూ మనకూయిచ్చాడా లేక యేమీ లేనివాళ్ళమని మనకేమన్నా తగ్గించాడా ఆ దేవుడు.

రాఘ—లేదు. అందరికీ సరిగానేయిచ్చాడు.

గోవిం—యిస్తే?

శ్రీహ—యెవరికిగాని వాటివల్ల వుపయోగం తెలుసునా!

గోవిం—కాళ్లు నడిచేటందుకు, చేతులు పనులు చేయుటకు, చెవులు వినుటకు, ముక్కు వాసన తెలుసుకొనను, కండ్లు చూచుటకు, తల మొదలైన తక్కిన అవయవములు వానివాని ప్రయోజనములు నెరవేరుస్తూవుంటే దేహయాత్ర జరుపుకోదగిన వుద్దేశ్యంతో దేవుడు మనుష్యకోటినంతా సమానంగా సృష్టించాడు.

గోవిం—అందుకనేనా, అమ్మ తెల్లవారిజామున్నే లేచి రాత్రి పదిఘంటలదాకా మూలుగుతూ ఆయాసపడుతూ మానకుండా యేదో పనిచేస్తూనేవుంటుంది.

జాన—యేం చెయ్యమన్నారు బాబూ. కుడిచి సుఖంగా కూచునే నోము నే నోచుకోలేదు. నిరంతరం కష్టజీవిని.

పద్మ—అమ్మా నేం చేసిపెడుతా లేవే పనంతానూ. నువ్వు కష్టపడొద్దు. వూరికే కూచోనుండు. నిన్నంటే నాకు చాలాఆశ. నువ్వు ఆయాసపడితే నాకు దిగులేస్తుంది.

జాన—వోసీ! నా వరాలతల్లీ! అమృతప్రవాహంలో నన్ను ముంచితేల్చావే. నీ ప్రేమపూరిత పవిత్రహృదయంలోనుంచివచ్చిన ఒకముద్దు మాటతోటే నా కష్టాలన్నీ తీరినట్లేవున్నవి చిట్టితల్లీ. నీ ముద్దుమాటయే నాకు వరాలమూట యింకేమి గావలె. కుడిచి కూరుచుండి నిర్వ్యాపారముగా గోళ్లుగిల్లుకుంటూ కుళ్లికువారిల్లే దానికంటే కష్టపడి కాలానాతిరిగి చెయ్యారా పనిచేసి తీరుబడి క్షణంలో యిట్లుముద్దుబిడ్డలతో సత్కాలక్షేప మొనర్చ్చవదే సుఖజీవనము. నాకింతకన్న కోరదగిన దికనేమున్నది.

పద్మ—అట్లాయితే అమ్మా ఆకలేస్తుందే అన్నం బెట్టవూ?

రాఘ—నా కన్నంవొద్దే అమ్మా పొద్దునాగూడా నెయ్యిలేకుండా వొట్టిపచ్చడి అన్నంపెడితే తినలేక పోయాను.

గోవిం—అమ్మా నొక్కరోజన్నా నెయ్యి వెయ్యవుగదూ.

పద్మ—అమ్మా మమ్మునారికే ముద్దులెట్టుకొంటూ ముచ్చటపడుతూ వుంటావే, నెయ్యిలేకుండా బువ్వపెడితే మరీ కారమేసీ మాకళ్లు చుట్టకొస్తే నీకు దిగులెయ్యదూ!

రాఘ:—అదేమిటే అమ్మా?

గోవిం—యేడుస్తావెందుకే?

పద్మ—మేమేమీ అడగంలేవే అమ్మా. నువ్వు పెట్టిందే తింటాంలే. అల్లరిచెయ్యం. నువ్వేడిస్తే నాకూ యేడుపొస్తుంది. మా అమ్మగదూ. వూరుకో యేమీ అడగంలే. అన్నయ్యలా అమ్మనడగొద్దు.

శ్రీహ—అరుగో కమలమ్మగారు.

జానకి—రా కమలా! యేమిటదీ?

కమల—యేదో కొంచెం పిల్లలకు బెట్టు ఆకలిగొన్నారు పాపం.

జానకి—పూటపూట యిదేమి తేవడం కమలా.

కమల—అమాటనకు పరవాలేదు. మేము తినుట మీరూరకుండుటయా. దైవము మాకొరకే యిచ్చెనా. సజ్జనులకు సాయపడుమని కూడ?

జానకి—పిల్లలనంపుమన్న రారా యిందులకై పళ్లెము మోసుకొని నీవు నడచి వీధివెంట రావలయునా.

కమల—నీయందుగల గౌరవముకంటె స్నేహముకంటె నాకీపళ్లెము బరువైనదా. సుహృజ్జనులను దర్శించుటకు నడచివచ్చుట గౌరవహానియా. వాహనాదులు వలయునా. ఆరాణివాసపు నడకవలన్నియు బూటకపు వేషములు. పిల్లలకిమ్ము తరువాత రమ్ము మాయింటికి.

జానకి—అటులే మంచిది.

రాఘ—యివెంతబాగున్నాయే. అమ్మా ఒక్కనాడన్నా యీలాంటివి చేసిపెట్టవు మాకు. అడిగితే యేడుస్తావు.

గోవిం—యీలాంటివి తినేందుకు లేకుండా...

పద్మ—కట్టుకునేందుకు మంచి పరికిణీల్లేకుండా—

రాఘ—యెన్నాళ్లు కష్టపడవలెనమ్మా మనము.

శ్రీహ—పంతులు చెప్పినట్లు ప్రార్థనచేస్తాను. దేవుడు మనందరికీ—

జానకి—ఒక్కసారే ఆమాటతోటీ జానకిముఖంలో విచారమంతా మాయమైంది. తలవూపింది. పెద్దనిట్టూర్పు విడిచింది. గోడనపటంలోవుండే లక్ష్మీనారాయణ మూర్తినిజూచి ఒక్కనమస్కారం చేసింది.

శ్రీహ—తెమ్మా అస్తమానమవుతూవుంది. దీపానికి చమురేదుగదూ పెందలాడే పాటాలు చదువుకోని పడుకుందాంరా.

పద్మా—అమ్మా బువ్వలేదుగదూ పడుకోంటా. కాస్సేపు చిచ్చిగొట్టు నిద్దరబోతా.

జాన—హా భగవంతుడా! మాకందరికీ వక్కసారే పెద్దనిద్దుర ప్రసాదింపుము. యీకష్టజీవిత మిక గడుపజాలను. యీ ముద్దుబిడ్డల యిడుములంజూచి సహింపలేను. * * *

రాత్రి రెండుజాములైనది. గోదావరీనది గంభీరముగా ప్రవహించుచున్నది. గట్టున జానకి తదేకదృష్టితో నిలుచుండియున్నది. చిన్నపిల్ల పద్మ భుజముపై నిదురించుచున్నది. తక్కినపిల్లలు గట్టున యిసుకపై బరుండి నిదురించుచున్నారు. పాపము వారచ్చటికెందులకు వచ్చిరో యెట్లు తేబడిరో వారెరుగరు.

జానకి గంభీరస్వరముతో నిట్లు చెప్పినది.

"ఓగోదావరీప్రవంతినీ! అమృతస్వరూపిణీ! యీ కష్టమయజీవన కుటుంబమునకు నీ యమృతగర్భమున నించుక తావొసంగుము. ప్రపంచమునంగల సమస్త జీవకోట్ల పాపపంకిలములను భవదీయ స్పర్శమాత్రమున మాయించి పరిశుద్ధుల చేయుచున్నావు. భగవతీ నీకరుణారసప్రవాహా పరిప్లుతంబై బెండువడియున్న యీసరక్షేత్రంబులు సైతము సమృద్ధసస్యఫలవంతములై అగణితప్రాణికోటి కమృతమును ప్రసాదించుచున్నవి. ఓ గిరిరాజపుత్రీ! నీ పుట్టువు అఖిలచేతనో జీవనంబునకై యిలపైవెలసినది. నీ గమనంబులు దుష్ప్రహతాపత స్థావరజంగమాత్మక జీవసముదాయమునకు జీవదాయంబులు. నీదర్శనము పతితపావనము. తల్లీ! దుర్భరంబులగు సంసారవిప్లవముల భరింపనేరక అగతికనై యమాయకులగు నీ బిడ్డలు ననుభవించు నిడుములంగడుప జాలక కులోచిత గౌరవములంబాటించి చేరదీసి యాదరించు వాస్తులంగానక అసహాయనై నిరుపేదనగుట అజ్ఞాన ధనగర్వచిత్తులగు జీవలోకపరాభవముల సహింపనేరక తల్లీ నిన్ను శరణుజొచ్చితిని. శిశుఘాతిని. ఆత్మహత్యామహాపాతకిని రక్షింపుము. అనుచితములగు బాల్యవివాహము లాచరింపబడినవారికిని పెద్దల యవివేకముచే సంసారసంరక్షణోపాధియగు సున్నత విద్య లభ్యసింపబడక అసమర్థలై కర్తవ్యతామూఢలై తపించు నభిమానవతులను చేరదీసి చల్లని నీకడుపున దాచుకొనుము. 'నస్త్రీస్వాతంత్ర్యమర్హతి' అను దారుణాశనిచే అబలాలోకము నధఃపతనము నొందించుట అన్యాయమని చల్లని నీ కరములెత్తి యుద్ఘోషింపుము. అమృతస్వరూపిణీ నీకివే పదివేలనమస్కారములు. వచ్చుచున్నాను."

అని యామె వెనుకకుమరలి నిదురించు పిల్లలవద్దికి వచ్చినది.

హా బిడ్డలారా "యీ మందభాగిని యుదరమున బుట్టకుండినచో మీకీ దుర్మరణములు ప్రాప్తించకుండెడివిగదా! ఆయ్యో దైవమా" అని యొక్కనిట్టూర్పు విడచినది. ఒక్కొక్కరినే యెత్తుకొన నుద్యుక్తయైనది.

అంతలో నొకవ్యక్తి యట కతివేగమునవచ్చి 'సాహసము మానుమాను' అని కేక వేసినది.

జానకి వెనుకకు మరలి "అయ్యో కష్టసాగరమును తరింపనీక అడ్డువచ్చిన దెవ్వరు నా దౌర్భాగ్యదేవతయా."

# నానాజాతిసమితి

వావిలాల గోపాలకృష్ణయ్యగారు

1914 వ సంవత్సరము జూలై నెల 28 వ తేదిని ఆస్ట్రియా దేశము, సైబీరియా దేశము పై యుద్ధము ప్రకటించుటయు, అంతట నాస్ట్రియా దేశమును జర్మనీ, టర్కీ, బల్గేరియా దేశములు మద్దతు అగుటయు తోడనే సైబీరియా దేశమును రష్యా, ఫ్రాన్సు, బెల్జియం, మాంటెనేగ్రో, ఇంగ్లాండు, కనడా, ఇండియా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, దక్షిణాఫ్రికాలును, జపాను, ఇటలి, రుమేనియా, పోర్చుగల్, గ్రీస్ దేశములును క్రమముగ 1917 ఏప్రెల్ 6వ తేదీ అమెరికా సంయుక్తరాష్ట్రములును మద్దతుచేయుటయు తన్మూలమున నయ్యది ప్రపంచయుద్ధముగ బరిణమించి నిరంతర ఘోరసంగ్రామము 1918 వ సంవత్సరమువరకు నిర్వహింపఁబడుచుండుటయు, ప్రపంచమునందలి అన్ని జాతులయందును పరస్పర ద్వేషానలములు కొనుటయు, ఘోరకాటకములు విజృంభించుటయు జరిగెను.

అట్టి 'మహాయుద్ధము' అంతమొందు విధానము తోచక ప్రపంచమహావేత్తలు తారుమారై శాంతిసన్నుతుల పఠించుటకేనియు నోపికగాని, కోరికగాని లేక తదేక సంగ్రామనిమగ్నులై యున్నతరి అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడగు శ్రీ వుడ్రోవిల్సన్ తన పదునాలుగు షరతులతో నేకసంఘ ప్రయత్నము ప్రారంభించెను. అంతెంత ద్రోహమునకు కుతంత్రమునకు తావుండియున్నను దేశములన్నియు శాంతి వాతావరణమున కెదురుచూచుచుండుటచేతను, అప్పటికి డస్సియుండుటచేతను అందరును కలసి ఆ 14 షరతులతో గూడిన సంధిపత్రముపై అసలు సంధి రాయబారము మాట్లాడుటకు 1918వ సంవత్సరము జనవరి 18 వ తేదీ ప్యారీస్ నగరములో శాంతిసమావేశము సమకూడెను. 4 సంవత్సరములు 3 నెలలు 11 దినము యుద్ధానంతరము 1918 వ సంవత్సరము నవంబరు 11వ తేదీని యుద్ధ విరామ సంధిపత్రము సంతకములు చేయబడెను.

అట్టి తాత్కాలిక యుద్ధవిరామ సంధి షరతులతో శాంతిసమావేశము వార్సేల్సు నగరమున 1919 వ సంవత్సరము జనవరి 18 వ తేదీన ప్రారంభింపబడి అన్ని దేశములుచర్చించుటతోడను, బెదిరించుటతోడను ముక్కవిరపులతోడను, మూతివిరపులతోడను కొంతకాలము జరిపి ఎట్టకేలకు పరస్పరాంగీకారమునకు వచ్చి ఆ సంవత్సరమునందే జూన్ 28వ తేదీని అన్ని దేశములును సంతకములు గావించి హృదయపరివర్తనము నొందెను.

ఏనాడు యుద్ధమునకు, పరస్పర ద్వేషానల మునకు స్వస్తిచెప్పుచు వార్సేల్సునందు సంతకముచేసిరో ఆనాడు ప్రపంచచరిత్రలో నొక నూతనాధ్యాయము ప్రారంభింపబడెను. అంతకుముందు పరస్పరయుద్ధములతో తమతమ మనోరథములను, కాంక్షలను తీర్చుకొను ప్రపంచజాతులు తమకు నపుడప్పుడు సంభవించు తగాదాలను తమలోతా మేర్పరచికొనిన పెద్దలచేత పరిష్కారమగుటకును, వాని నన్నిజాతులవా రేకగ్రీవముగ నంగీకరించి శిరసావహించి అమలు జరపుటకును నొక నానాజాతిసమితి నేర్పాటు గావించికొనిరి.

వార్సేల్సు సంధిపత్రముపై సంతకములు జరుగుటతో 1920వ సంవత్సరము జనవరి 10 వ తేదీనుండి నానాజాతిసమితి అమలులోనికి వచ్చెను. ప్రపంచములోని వివిధ జాతులమధ్య పరస్పర సహకార సౌమనస్యములు ప్రబోధితమగుటయును, ప్రపంచ శాంతిసంస్థాపనము నిర్వహింపఁబడుటయును ఈ నానాజాతిసమితియొక్క ఆదర్శములై యుండెను.

ఈ సమితి విధానము మిత్రజాతుల ప్రతినిధులు తయారుచేసిరి. జర్మనీ మొదలగు శత్రుజాతులకు దగిన ఆదరణ, గౌరవములు కల్పింపఁబడకపోయినను నాటిపరిస్థితులనుబట్టి అన్నిమతములను అన్ని దేశములు చివరకు శత్రుజాతులును అంగీకరింపక తప్పదాయెను. ఈ నిర్మాణప్రణాళికలో 26 సూత్రములున్నవి. సాధ్యమయిన అన్ని విధానములవలనను ప్రయత్నించి విఫలులైననే యుద్ధమునకు గడంగవలసినదేగాని ఈలోపుగ తస్సనిబున్సని కల్లయుద్ధము అంగీకరించని షరతును విధించుకొనిరి. తమలో వివాదమేదైనను సంభవించిన దానిని వెంటనే నానాజాతిసమితికి తెలుపవలెను. వారు పరిష్కారపు ఉత్తరువునకై ఆరునెలల వేచియుండవలెను. అటుపై మరికొంత గడవు కాలము అనగా మూడు నెలలు వేచియుండవలెను.

ఈ జాతిసమితి మహాసభ (ఎసెంబ్లీ) సంవత్సరమున కొకసారి జినీవాలో సెప్టెంబరు నెలలో సమావేశమగుచుండును. ఇందు ప్రతి జాతినుండియును ముగ్గురు ప్రతినిధులు పంపబడుదురు. అయితే ప్రతి జాతియు నొక్కవోటును మాత్రమే ఇవ్వ నర్హతగలిగియుండును. ఈ నానాజాతి సమితికి కౌన్సిలు (శిష్టసభ) అని యొక ఉపాంగము కలదు. ఇది సంవత్సరమునకు మూడుమారులు సమావేశమగును. ఈ కౌన్సిలునందు శాశ్వతసభ్యులగు గ్రేటు బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, జపాను అయిదు దేశములును, ఎసెంబ్లీలో మూడు సంవత్సరములు సభ్యతగల శాశ్వతేతర సభ్యులనుండి తొమ్మిదిమందియును సభ్యులుగనుందురు. ఈ జాతిసమితికి సంబంధించి యొక ప్రపంచ న్యాయస్థానమును, అంతర్జాతీయ కార్మికసంస్థయును గలవు.

### ప్రపంచ న్యాయస్థానము

నానాజాతిసమితి ఒడంబడికలోని 14వ సూత్రముప్రకారము అంతర్జాతీయ శాశ్వత న్యాయస్థానమును నిర్మాణము గావించి ఏర్పాటు చేయుటకు నానాజాతిసమితి కౌన్సిలు ప్రణాళికను తయారుచేసి పంప వలెను. అంతర్జాతీయవిషయములపై తగాదా వచ్చిన వివాదజాతులు రెండును తమ కున్న వివాదములు సమర్పించుకొనిన అట్టి తగాదాలను విని, పరిష్కరించుటకు ఈ న్యాయస్థానమున కధికారము కలదు. కౌన్సిలుచేగాని, ఎసెంబ్లీచేగాని ఏదేని సందర్భములో అనుమానముండి కోర్టుకు తెలియజేయుదురేని ఈకోర్టు అట్టి సమస్యలపై తమ సలహా నొసంగవచ్చును.

1922 సంవత్సరము మేనెలలో కౌన్సిలు గావించిన నిబంధన ప్రకారము ఈ కోర్టు నందు ప్రపంచములోని అన్నిజాతులకును ప్రవేశార్హతకలదు. అయితే కోర్టు జారీ చేసిన పరిష్కారమునకు వ్యతిరేకపక్ష మంగీకరించుచో వారిపై యుద్ధమునకు గడంగమనియు, పరిపూర్ణ విశ్వాసముతోను నమలుజరుపుదుమనియు, అంతర్జాతీయసమితి నిర్మాణము (కావొనెన్ట్) ప్రకారము న్యాయస్థానాధికారావరణము నంగీకరించుచు సమ్మతిపత్రమును వ్రాసి యివ్వవలయును. న్యాయస్థానములోనున్న తీర్పరులలో తమజాతికి సంబంధించిన న్యాయాధిపతి లేనియెడల ఈ సందర్భమున మాత్రమే న్యాయాధిపతిగనుండుట కేదేశ మేని తన తరపున నొక న్యాయమూర్తి నెన్నుకొనవచ్చును. ఇపుడు 15 మంది న్యాయమూర్తులున్నారు. ఈనడుమ నొక ఖాళీరాగా భారతదేశములోని సర్ తేజ బహదూర్ సప్రూగారిని నియమించిరి గాని ఈ నియమికము త్వరలోనే అంతరించెను. ఈ న్యాయస్థానము హేగ్ పట్టణమునందుండును. అందుచే దీనిని హేగ్‌న్యాయస్థానము (కోర్టు) అనియు వ్యవహరించుచుందురు.

### అంతర్జాతీయ కార్మికనిర్మాణము

సభ్యులుగ జేరిన నానాదేశముల ప్రతినిధులు ప్రతి సంవత్సరము సమావేశమగు మహాసభయై వెలయు నొక శాశ్వతనిర్మాణ మీ అంతర్జాతీయ కార్మికనిర్మాణము. మరియు నొక పాలకవర్గముచే పరిపాలింపఁబడు అంతర్జాతీయ కార్మిక కార్యాలయము నిర్వహింపఁబడుచున్నది. ఈ ప్రతిసంవత్సరమును సమావేశమగు మహాసభకు ఈ అంతర్జాతీయ కార్మిక నిర్మాణమునందు సభ్యులుగ జేరిన ప్రతి దేశము లేక జాతినుండి పనివారి తరపున పంపబడిన ప్రతినిధి యొకరు, యజమానుల తరపున పంపబడు ప్రతినిధి యొకరు, ప్రభుత్వపు ప్రతినిధు లిరువురు మొత్తము నలువురు ప్రతినిధులు పంపఁబడుచుందురు. అంతర్జాతీయ కార్మికకార్యాలయము నానాజాతిసమితి కార్యవర్గ కార్యాలయమున కేమియు సంబంధములేక వ్యవహార నిర్వహణమునందుగాని విధాననిర్ణయమునందు

గాని స్వతంత్రసంస్థయై వెలసి జినీవాలోనే యుండి నిర్వహింపబడుచున్నది. అంతర్జాతీయ కార్మికవిషయములు, స్థితిగతులు, జీతకెలు, పనిచేయు కాలములు, కార్మికుల కివ్వబడు సదుపాయములు వీలైనంతవరకు అన్ని దేశములమీదను ఏకవిధానముగ నిర్వహింపఁబడగలందులకు ప్రయత్నించుచున్నా మనునది దీని ఆదర్శముగాని మన భారత దేశ వ్యవహారము వచ్చునప్పటి కిట్టి సంస్థలన్నియు నెందుకును చేతగాని సంస్థలగు చున్నవి. 48 గంటలకన్న వారమునకు ఎక్కువపని చేయించకూడదని అంతర్జాతీయ కార్మికసమావేశమువారు తీర్మానించగా అట్టిది అవసరములేదని ఈ సంవత్సరపు భారతశాసనసభలోనే ప్రభుత్వ సభ్యుడే ప్రతిపాదించి నెగ్గించుకొనెను. అపు డేమిచేయుటకును చేతగాని సంస్థయీ అంతర్జాతీయ కార్మికసమస్య సభ. ఈ మహాసభయే శాసనాధికారముల గలిగియున్నది. వివిధదేశములమధ్య సంభవించు కార్మికతగవు తీర్చుట కనువగు సంధిపత్రములను నిర్ణయించ హక్కుగలిగి యున్నదని వర్తింపబడుచున్నది. అవసరమగు విధానములను, పద్ధతులను, రీతులను నిర్ణయించుచుండును.

సంధిపత్రములు

నానాజాతిసమితి జన్మించుటకు ముందుగా అన్యదేశముతోను మొట్టమొదట నొకరివెంట నొకరు సంధిపత్రము (ట్రీటీ)లను సంతకము చేసికొనిరి. వార్సేల్సు నగరమున జర్మనీతో 1919వ సంవత్సరము జూన్ 28 వ తేదీ మొట్టమొదట సంధిచేసికొనబడెను. దీనినే వర్సేల్సు సంధియందురు. అటుతరువాత ఆస్ట్రియాదేశములో 1919 వ సంవత్సరముననే సెప్టెంబరు 10 వ తేదీ సంధిచేసికొనబడెను. ఈసంధిని సెంట జర్మయిన్ సంధి యని వ్యవహరింతుము. ఆ సంవత్సరమే నవంబరు 22 వ తేదీ బల్గేరియాతో సంధిచేసికొనిరి. దీనిని 'నుయిల్లీ సంధి' యని వ్యవహరింతురు. 1920 వ సంవత్సరము జూన్ 4 వ తేదీ హంగేరియా దేశముతో సంధిజేసికొనిరి. దానినిహంగేరియన్ సంధియందురు. అటుతరువాత ఆసంవత్సరముననే ఆగస్టు 10వ తేదీ తురుష్క దేశముతో సంధిజేసికొనిరి. దీనిని 'సేవరేస్' సంధియని పిలతురు.

ఇట్టి సంధిపత్రములన్నియు సంతకము అయిన తరువాత నానాజాతిసమితి స్థాపనము నిశ్చయింపఁబడి 26 సూత్రములతో అంతర్జాతీయ ప్రణాళిక (కావొనెన్‌ట్) ఈ క్రిందిదేశములవారిచే 1920వ సంవత్సరము జనవరి 10వ తేదీ సంతకములు గానింపఁబడెను.

1. అమెరికా సంయుక్త [రాష్ట్రములు
2. బెల్జియం
3. బొలివియా
4. బ్రెజైల్
5. బ్రిటీషు సామ్రాజ్యము
(1) కనడా
(2) ఆస్ట్రేలియా

12. గ్వాటిమలే
13. హైటీ
14. హెడ్జీజ్
15. హొండూరాస్
16. ఇటలీ
17. జపాను
18. లిబేరియా
19. నికారుగ్వే

| | |
|---|---|
| (3) దక్షిణాఫ్రికా | 20. పెరూ |
| (4) న్యూజీలాండ్ | 21. పోలాండ్ |
| (5) ఇండియా | 22. పోర్చుగల్ |
| 6. చైనా | 23. రుమేనియా |
| 7. క్యూబా | 24. సెర్బ్-క్రోట్-స్లోవ్ స్టేట్ |
| 8. చెకోస్లొవేకియా | |
| 9. ఈక్వేడర్ | 25. సయాం |
| 10. ఫ్రాంసు | 26. ఉరుగ్వే |
| 11. గ్రీస్ | 27. జర్మనీ |

ఈ పై 32 దేశము ప్రతినిధులు తమ తమ దేశముల తరపున ప్రణాళిక నంగీకరించుచు మరియు నీక్రింది దేశమువారిని ఈ ప్రణాళిక (కావొనెన్ట్) నందు ప్రవేశించగలందులకు ఆహ్వానించిరి.

| | |
|---|---|
| అర్జంటైన్ రిపబ్లిక్ | పర్షియా |
| చైల్ | సాల్ వాడోర |
| కొలంబియా | స్పెయిన్ |
| డెన్ మార్కు | స్వీడన్ |
| నెదర్ లాండ్సు | స్విడ్జర్లాండ్ |
| నార్వే | వెనిజూలా |
| పెరగ్వే | |

ఏ మహానుభావుడు ప్రపంచశాంతికి సాధనోపాయము జూపెనో, ఏ మహా మహుని ఆదేశానుసారము అన్ని జాతులును సంఘములు, రాజ్యములు సమితిగ నేర్పడుట కంగీకరించిరో అట్టి సంధాత తన దేశము తరపున సంతకముచేసి అమెరికాకు తిరిగివెల్లి తా నొనరించిన కార్యమును నివేదింప నచటి ప్రజాప్రతినిధి సభవారు తమ అధ్యక్షుని విల్సన్ మహాశయుని కార్యమును వ్యతిరేకించి నానా జాతిసమితిలో సభ్యులుగ జేరుట కంగీకరించక తమ అధ్యక్షునికి ప్రపంచములో నవమాన మొదవింపజేసిరి. ప్రపంచములో నత్యల్పకాలములో ప్రపంచవిఖ్యాతినందిన ఘనుడుగాని మరల నత్యంతాల్పకాలములో నత్యధిక న్యూనతను బడసినవారుగాని ప్రెసిడెంట్ విల్సన్‌కు మించి మరొకరుండబోరు. అందుచే ప్రథమకబళముననే దంతభగ్నమనినట్లు కావొనెంటులో సంతకముచేసిన ఒకజాతి అపుడే జారిపోయెను.

అటుతరువాత నీ సమితినుండి 1927లో కోస్తారికా దేశమును, 1928వ సంవత్సరములో బ్రెజిల్ దేశమును, 1933వ సంవత్సరమున జపాను దేశమును, జర్మనీయును తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చి జాతిసమితిని విడచిపోయిరి. అటుతరువాత 1934లో సోవియట్ రష్యా, అఫ్ఘనిస్థానము ఈక్వేడర్ దేశములును ఇందు సభ్యులుగ జేరను.

సమితిసభ్య దేశములు

| దేశము | జనసంఖ్య | వైశాల్యము |
|---|---|---|
| 1. అబిసీనియా | 110,00,000 | 350,000 |
| 2. అఫ్ఘనిస్థానము | 120,00,000 | 24,5000 |
| 3. అల్ బేనియా | 10,03,104 | 10,600 |
| 4. అర్జంటైనా | 118,46,000 | 11,53,000 |
| 5. ఆస్ట్రేలియా | 93,47,000 | 30,00,000 |
| 6. ఆస్ట్రియా | 6,530,000 | 32,000 |
| 7. బెల్జియము | 8,213,449 | 11,752 |
| 8. బొలివియా | 2,924,900 | 506,000 |
| 9. బల్గేరియా | 5,944,000 | 39,884 |

| | | | |
|---|---|---|---|
| 10. | కనడా | 8,788,500 | 3,648,500 |
| 11. | చైల్ | 286,322 | 4.276,700 |
| 12. | చైనా | 43,89,33,373 | 4,277,000 |
| 13. | కొలంబియా | 8,000,000 | 482,000 |
| 14. | క్యూబా | 4,011,000 | 41,000 |
| 15. | చెకోస్లోవియా | 14,600,000 | 54,000 |
| 16. | డెన్‌మార్కు | 3,500,000 | 16,570 |
| 17. | డొమినికన్ రిపబ్లిక్ | 1,024,000 | 19,300 |
| 18. | ఇస్థోనియా | 1,116,00 | 18,500 |
| 19. | ఈక్వేడర్ | 1,700,000 | 118,627 |
| 20. | ఫిన్‌ల్యాండ్ | 3,580,000 | 144,300 |
| 21. | ఫ్రాన్సు | 41,834,923 | 212,660 |
| 22. | గ్రేట్‌బ్రిటన్ | 47,790,485 | 115,868 |
| 23. | గ్రీస్ | 6,205,000 | 48,290 |
| 24. | గ్వేటిమలె | 2,500,000 | 48,290 |
| 25. | హైటీ | 2,300,000 | 10,200 |
| 26. | హోండూరాస్ | 773,500 | 46,000 |
| 27. | హంగేరీ | 8,500,000 | 35,900 |
| 28. | ఇండియా | 3,52,986876 | 1,700.000 |
| 29. | ఐరిష్‌ఫ్రీస్టేట్ | 3,00,00,000 | 26.600 |
| 30. | ఇటలీ | 41,150,000 | 119,000 |
| 31. | ఇరాకు | 3,000,000 | 143,240 |
| 32. | లట్వియా | 1,900,000 | 40,850 |
| 33. | లిబేరియా | 2,000,000 | 45,000 |
| 34. | లిథూనియా | 2,290,000 | 20,500 |
| 35. | లెగ్జంబర్గ | | 999 |
| 36. | మెక్సికో | 16,520,000 | 760,300 |
| 37. | నెదర్‌లాండ్స్ | 8,183,327 | 12,590 |
| 38. | న్యూజీలాండ్ | 1,410,000 | 104,000 |
| 39. | నికార్‌గ్వా | 700,000 | 49,200 |
| 40. | నార్వే | 2,800,000 | 124,964 |
| 41. | పెనామా | | 33,667 |
| 42. | పెరుగ్వే | | |
| 43. | పర్షియా | 10,000,000 | 628,000 |
| 44. | పెరూ | 5,500,000 | 55,000 |
| 45. | పోర్చుగల్ | 6,19,0000 | 35,490 |
| 46. | రుమేనియా | 17,400,000 | 122,282 |
| 47. | సల్‌వేడర్ | 1700,000 | 13,173 |
| 48. | సయాం | 10,000,000 | 200,150 |
| 49. | దక్షిణాఫ్రికా | 7,000,000 | 472,350 |
| 50. | సోవియట్ రష్యా | 147,000,000 | 8,150,000 |
| 51. | స్పైన్ | 22,800,000 | 194,000 |
| 52. | స్వీడన్ | 6,000,000 | 173,150 |
| 53. | స్విడ్జర్లాండ్ | 4,000,000 | 15,800 |
| 54. | టర్కీ | 14,000,000 | 282,000 |
| 55. | ఉరుగ్వై | 1,900,000 | 721,80 |
| 56. | వెనిజులా | 3,025,000 | 395,000 |
| 57. | యుగోస్లేవియా | 12,000,000 | 96,150 |

ఈ సమితియందు సభ్యులుగ జేరినను, జేరకపోయినను సభ్యేతరజాతులును వీరు నిర్వహించు సభలు, సంప్రదింపులలో వారును పాల్గొనవచ్చును, పాల్గొనుచునే యున్నారనవచ్చును. ఈ క్రింది దత్తత (మాన్‌డేటరీ) రాజ్యములును నిర్వచింపబడి ఆయా దేశములవారి ఆజ్ఞలకు లోబడి వ్యవహరింపబడుచున్నవి.

దత్తతా రాజ్యములు

ఫ్రాన్సుక్రింద

1. లెబానాన్
2. సైరియా
3. టంకన్యాకా
4. కామెరూన్సు

యునైటెడ్ కింగ్‌డమ్‌క్రింద

1. పాలస్తైన్

2. ట్రాన్సు-జోర్డన్
3. టోగోలాండ్
4. కామరూన్స్
5. టంగన్యికా
6. నవ్ రూ

బెల్జియంక్రింద

1. రవుండ-ఉరుండి

దక్షిణాఫ్రికా యూనియన్ క్రింద

1. సౌత్-వెస్టుఆఫ్రికా

జపానుక్రింద

1. మారియనాస్, కేరోలైన్ దీవులు
2. యాప్ దీవి, మార్షల్ దీవి

ఆస్ట్రేలియాక్రింద

1. న్యూగయానా
2. న్యూఐర్లాండు
3. సోలమన్ దీవులు

న్యూజీలాండ్ క్రింద

1. శామోయి

(భారతదేశము క్రింద దత్తరాజ్యములు లేకపోగా ఉండియున్న రా జ్య ము లు, దీవులు, రాజ్యభాగములు భారతప్రభుత్వములోనుండి విడదీసి అటు గవర్నరుజనరల్ గారి స్వంతబాధ్యతలకో కిరీటమునకో అంటగట్టబడుట భారతభాగ్యము గాక మరేమి?)

ఆర్థికసంపత్తి

ఈ అంతర్జాతీయసమితి ఎవరి రాజ్యమును, దత్తతారాజ్యములను వారివి వారు సురక్షితముగ పరిపాలించుచుండుటకును, పరరాజ్యాక్రమణము జరుగకుండను చూచుచుండుటకై నానాజాతిసమితిలో చేరిన సభ్యజాతి వార్షికముగ కొంత ధనము చెల్లించవలెను. ఈసమితి క్రిందనున్న (1) లీగుఅసెంబ్లీ, (2) లీగుకౌన్సిల్, (3) అంతర్జాతీయ న్యాయస్థానము (4) శాశ్వత కార్యవర్గకార్యాలయము, (5) అంతర్జాతీయ కార్మికకార్యాలయముల ఖర్చులు సమితి నిర్వహించుచుండును. దీని కార్యాలయము జినీవాలోనుండును. ఈపట్టణము నానాజాతిసమితికి చెందినదై యున్నది. వీరి వ్యవహారము సామాన్యముగ ఫ్రాన్సుభాషలోను, ఫ్రాన్సు నాణెములలోను వ్యవహరింపఁబడుచుండును. ఈసమితి ఖర్చులు ఈవిధముగ నంచనావేయబడెను. (ఫ్రాంకు బంగారునాణెము ఫ్రాంసుదేశములో వ్యవహరింపఁబడునది.)

సమితి ఖర్చులు

| సంవత్సరము | ఫ్రాంకులు |
|---|---|
| 1930 | 28,210,248 |
| 1931 | 31,632,501 |
| 1932 | 33,687,994 |
| 1933 | 33,429,134 |
| 1934 | 30,827,805 |
| 1935 | 32,932,605 |

ఇంత ధనమును వ్యయపరచినను, ఇంత ప్రజాశక్తిని వృథాపరచినను, ఇంత సహాయ సంపత్తులను బడసినను ఈ నానాజాతిసమితి దేశములలో జరుగు అంతరంగిక కల్లోలములు విషయములో జోక్యము కలిగించుకొనకపోగా అంతర్జాతీయ విషయముల

లోను ఘోరమగు అన్యాయము జరుగుచున్నను అసమర్థమై వరలుచున్నది.

1933వ సంవత్సరములో జపాను దేశము అన్యాయముగ మంచూరియాపై దాడి వెడలి ఆ దేశస్వాతంత్ర్యము హరించి అమానుషముగ పోరుసల్పినపుడు జాతి సమితివారు తమ ప్రతినిధులను బంపి విచారణలు చేయించి జపానుదే అన్యాయమని తేల్చినపుడు నోరు మెదపలేక అసమర్థమై యుండి తన శక్తిని, తన ఆదర్శమును గోల్పోయెను.

నేడు—ఇపుడు మానవత్వము లేదనుచున్నదో యనునట్లు ఇటలీదేశము అనాథలగు పశుబలశూన్యులగు అబిసీనియనులపై దాడిసల్పుచుండ ఇటలీదేశమును ఆంక్షలోనుంచి ఆంక్షలములు జరుపవలసినదని ఆర్థికస్వాతంత్ర్యములేని ఇండియా నొక్కదానినిచే జరిపించగలిగిరి గాని మరేదేశమును ఆంక్షల నములుజరుపదాయెను. తనను బెదిరించిన ఇటలీ అడుగులకు మడుగులొత్తించినదేగాని, ఎదురాడ వెలిచుచున్నదేగాని అన్నిజాతులను కేంద్రీకరించి యుద్ధమొనరించుటో సహాయసంపత్తి లొనగూర్చుటయో జేయజాలకున్నది. ఉపసంఘములు, నివేదికలు, చర్చలు, కోర్టుతీర్పులు, సారాంశములు, న్యాయసంశయములు, ఈవిధముగ చెప్పిన మాటచెప్పక చేసినపనిచేయక ఒకప్రక్క రెండు జాతులును హతమారుచుండ అల్పజాతి నశించుచుండ తన పనులతో సరిపుచ్చుకొనుచున్నది. ఆపద్బంధువుగ ప్రవర్తింపజాలకున్న ఈ సంస్థ ప్రపంచమునకు భారముగాక సేవచేయునన తలంపవీలులేదు. చేసినపనియున్నను లేకున్నను ప్రతిసంవత్సరము తమ విరాళము వసూలు మానజాలరు తమాషాకబుర్లలో అంతర్జాతీయ సఖ్యమేగాని, ప్రాణగొడ్డములగు సమస్యలలో ఉత్తరకుమార ప్రవచనములతో నింపివేయుచున్న ఈ అంతర్జాతీయసమాఖ్య—నానాజాతిసమితి నాటకమింక నెన్నాళ్లో చూడవలసియున్నది. దీనివలన కాదగిన ప్రయోజన మిసుమంతయేనియు లేదని ప్రపంచ రాజకీయజిజ్ఞాసువులకు బోధపడుచునేయున్నది. అయినను జర్మనీ ప్రాంసుల వివాదసందర్భములో నెటుల వ్యవహరించనున్నదో వేచి తెలియవలసియున్నది.



బొంబాయినగరమునగల భారతీయ సంగీతపాఠశాల దశమి వార్షికోత్సవసందర్భమున
గాన ప్రదర్శనమున పాల్గొన్న కొందరు గాయకురాండ్రు



# శిశు పోషణ

నిశ్శబ్దంగా మంచిగాలి వెలుతురు వచ్చేదిగా వుండవలె గది. ఏమాత్రం సామాన్లతో క్రిక్కిరిసుండకూడదు.

బిడ్డలు పాలకుతప్ప మేల్కొరు కొత్తలో.

**నిద్ర** వారికి రాత్రింపగల్లూ నిద్రే. ఈ నిద్ర క్రమంగా తగ్గుతుంది. ఏళ్ళాదయే టప్పటికి పదహారుగంటలు మాత్రమే నిద్రపోతారు.

గాలిలేకున్నా, ఆహారం ఎక్కువైనా సరిలేకున్నా, మంకువల్లా, పండ్లువచ్చేటప్పుడూ బిడ్డలు సరిగా నిద్రపోరు. అలాంటప్పుడు తగుపరిహారంచెయ్యడం అవశ్యం కారణం ఫలానా అని నిశ్చయించి. నిద్రకదా పోవడం లేదని ఏమందో మాకో లేక ఇంత నల్లమందో వాడుతారు. ఇది ప్రమాదాలకుమూలం.

రబ్బరుపీక నోట్లో పెట్టడంకూడాచెడుపే. దీనివల్ల గొంతుజబ్బులు, ముక్కులో జబ్బులు కలుగుతవి.

బిడ్డలకు గుడ్డలు కొంచెం ఎక్కువగానే జాగ్రతచేసుకోవాలె మలమూత్రాలవల్ల పాలు కక్కడంవల్ల చాలామైలవుతవి కాబట్టి. ఈ గుడ్డలు శుభ్రంగా వాసనలేకుండా ఉండేటట్టు ప్రతిదినం సబ్బుతో ఉతికి గుడ్డలు ఉపయోగించవలె. వీలుంటే చాకలిచేత ఉతికించటం ప్రశస్తం. ఈగుడ్డలు చిన్నవిగా వుండటమే మంచిది. మైలకాగానే తీసి పారెయ్యవచ్చు. అలాతీసి వెయ్యడం అవశ్యమున్నా.

పెద్దవివాడుతూ తడిసిన మడిచి అదేవాడటం, తడిసిన ఉతకక ఎండబెట్టివాడటం అనుసరించవాల్సిన అలవాట్లు కావు.

పరుపులు వగైరా మలమూత్రాదులతో చెడకుండా Oil Cloth ఉండటం మంచిది.

ఇక చొక్కాలు సులభంగా తియ్యడానికి వెయ్యడానికి కాళ్లుచేతులు కదలించడానికి తగినట్లూ తేలిగ్గాను వుండవలె. తేలికయినవి వుతకడం సులభం. అవి ఎండటం సులభం. పిల్లలకు మేజోళ్లు, బూట్సులు తొడిగి టోపీలుపెట్టి మనం మురుస్తాము. ఇది కూడదు - ముఖ్యంగా ఎండాకాలంలో.

—ఎస్. శేషగిరిరావు.

# పుష్పచయము

## మంత్రిని బదులు మాటాడనీయని భార్య

సర్ జ్వాలా శ్రీవస్తవ గారు సంయుక్తపరగణాల విద్యాశాఖమంత్రి. ఆతని భార్యయగు శ్రీమతి కైలాస్ శ్రీవస్తవ శాసనసభయందొక మెంబరు. పాపమా మంత్రికి సభయందు భార్య ప్రశ్నలకు బదులు చెప్పలేనంతటి పరిస్థితు లెన్నోమార్లు సంభవించినవి. కొలదికాలము క్రిందట యీ మంత్రిగారిని ప్రశ్నపరంపరలతో భార్య గడగడలాడించినది. మండలవిద్యాసంఘము వారు ఎడ్యుకేషనల్ బోర్డులకు తగిన స్త్రీల నియమింపనిదే దీనికి కారణము. అపుడు శాసనసభయందు జరిగిన వాద మిది:—

కైలాస్ శ్రీవస్తవ:—తగిన స్త్రీలున్నపుడు ప్రభుత్వమువా రెందులకు పురుషుల నామినేట్ గావించిరి?

సర్ జ్వా. శ్రీ. :—మండలసంఘము వారు తగినవారని యెంచలేదు. అందుచే వారి నెన్నుకొనలేదు.

కై. శ్రీ. :—మిస్ శర్మ బి.ఎ., (మీరట్)గారు ప్రజోపకార్యధురంధరగదా! ఆమె నెందుకు నామినేట్ చేయలేదు?

స. జ్వా. శ్రీ. :—ప్రభుత్వమే స్త్రీనిగాని నామినేట్ చేయజాలరు. బోర్డు (సంఘము) యెన్నుకొనినవారినే ప్రభుత్వమువారు నియమింపగలరు. ఆస్త్రీని బోర్డు విచారణచేయలేదు గాన ప్రభుత్వమువా రశక్తులై యుండిరి.

కై. శ్రీ. :—తగినవారున్నపుడు బోర్డు ప్రభుత్వము వారి నడుగ పనిలేదా? ప్రభుత్వమువారు నామినేటు చేయగూడదా?

అధ్యక్షుడు :—ప్రభుత్వమువారు శక్తిహీనులు. (నవ్వు)

కై. శ్రీ. :—హాల్డ్వాని మిసర్స అహమద్ యెన్నికలందు పాల్గొని ఒకవోటు తక్కువగా వచ్చుటచే నోడింపబడుట నిజమేనా?

స. జ్వా. శ్రీ. :—ఆసంగతి నాకు తెలియదు.

కై. శ్రీ. :—ప్రస్తుతపు చట్టముప్రకార మొక స్త్రీ సభయం దుండవలయునని అనుకొనుచున్నాను.

స. జ్వా. శ్రీ. :—అది చట్టమే. ప్రభుత్వమువా రంగీకరించుచో ఆ వ్యక్తిగూడ పురుషుడుగా నుండవచ్చును.

కై. శ్రీ. :—స్త్రీ యభ్యర్థుల కీ యన్యాయ మేల గావింపబడినది?

స. జ్వా. శ్రీ. :—అట్టి అన్యాయమేమియు జరుగలేదని నే నిదివరకే చెప్పియుంటిని.

కై. శ్రీ. :—ఈ అన్యాయమునకు కారణములు గనిపెట్టి చక్కజేయుటకు విద్యాశాఖమంత్రి చేయవలసినది గదా?

స. జ్వా. శ్రీ. :—అన్యాయము జరిగియుండునని మే మంగీకరింపజాలము. బోర్డువారి దృష్టికి తగిన స్త్రీ గోచరింపలేదు.

కై. శ్రీ. :—ప్రభుత్వమువా రాబోర్డును మరియొకమారు వారి తీర్మానమును గమనింపుమని కోరెదరా?

స. జ్యా. శ్రీ. :—మేము వారి సిఫారసుల చాలమారులు త్రోసి వేసితిమి. ప్రతివిషయమునను దాని విలువనుబట్టి మేము తీర్మానింతుము.

కై. శ్రీ. :—ప్రభుత్వమువా రిప్పటి చట్టమును సవరించి, తగిన స్త్రీ లున్నపుడే బోర్డు యెన్నుకొను నట్లు అమలులోనుంచుటకు సిద్ధముగనున్నారా?

స. జ్యా. శ్రీ. :—అది బోర్డు చేయవలసినది. అట్లని చట్టమునందే గలదు.

ఖాన్ బహద్దూర్ సయ్యద్ జాఫర్ హుసేన్ (మరొక సభ్యుడు) :—డిస్ట్రిక్టుబోర్డులు ఎడ్యుకేషన్ కమిటీయందొక స్త్రీ యుండవలసిన దావశ్యకమని గుర్తించునట్టి ప్రకటనను ప్రభుత్వమువారు ప్రకటింప సంసిద్ధులా?

స. జ్యా. శ్రీ. :—మేమిదివఱకే ఆ కార్యమును గావించితిమి. కాని స్త్రీలు దొరకని పరిస్థితులుండక తప్పదు.

షేక్ హబీబుల్లా (మరొక సభ్యుడు) :—స్త్రీల స్థానములకు పురుషుల నియమించిన ప్రతిచోటునందును తగిన స్త్రీలు దొరక లేదని ప్రభుత్వమువారు నమ్మినారా?

జ్యా. శ్రీ. :—ఏ స్త్రీయు తగినట్లు గాన్పింపలేదు.

షేక్ హబీబుల్లా :—'తగుట' అనుదానికి పరీక్షయేమి?

స. జ్యా. శ్రీ. :—పరీక్ష లెన్నోయున్నవి. వాని నేనిట వివరింపదలచుకొనలేదు.

కై. శ్రీ. :—ప్రభుత్వమువారు డిస్ట్రిక్టుబోర్డులవారిని "తగిన స్త్రీ" అన్నదాని కేమి నిర్వచనమో తెలుపమని యడిగెదరా? (నవ్వు)

స. జ్యా. శ్రీ. :—ప్రపంచములో దేనికైనను పూర్తిగ నిర్వచనమిచ్చుటసంభవము. కావున బోర్డువారు "తగిన స్త్రీ" అనుదానికి సులభముగ అర్థము చెప్పలేరనియే నా యభిప్రాయము.

కై. శ్రీ. :—పట్టభద్రులను స్త్రీలుగూడ యీస్థానము బడయుటకు నిరాకరింపబడిరి. కావున ఎడ్యుకేషనల్ కమిటీ కెట్టి 'తగినవారు' గావలయునో తెలుపగోరెదను.

అధ్యక్షుడు :—విద్యాశాఖమంత్రిగారు బహుశా ఎం. ఎస్. సి. గావలయునని కోరుతారేమో? (విగ్గరగా నవ్వు). (ఈ సతీమణిగూడ ఎం. ఎస్. సి. ఏమో?)

## స్త్రీలు ప్రపంచమును పరిపాలిస్తే?

లండను నగరమున మహిళా లేఖక కార్యదర్శులసభ వార్షికోత్సవ సందర్భమున శ్రీమతి డోరతి ఇవాన్స్ అధ్యక్షతవహించి యిట్లనుడివిరి.

"పరస్పరాభిప్రాయములవగాహ మెవర్చుకొన నశక్తులైన వివిధదేశముల పరిపాలకుల గాంచినపుడు వారింక వారియధికారమును ఆయాదేశ మహిళామణుల కొప్పగించుటుత్తమమని మన మనుకొనకుండ నుండజాలము.

## కేసరి పుష్పత్రయము

## మాలతి

ఇది బాదంపప్పుపాలనుండి తయారుచేయబడిన యొక్క తెల్లటి సువాసనగల నవనీతము వంటిది. దీనిని తలదువ్వుకొనుటకు ముందు కొద్దిగ రాచుకొని దువ్వుకొనిన వెంట్రుకలు తెగక పట్టుకుచ్చువలె మిసమిసలాడుచుండును. మెదడు చల్లబడి నిద్రవచ్చును. ఇందు మాలతీపుష్పముల అత్తరు చేరియున్నది. ఈ అత్తరు సుఖమైన సువాసనకు పేరుగాంచినది.

వెల బుడ్డి 1_కి 8 అణాలు

## మాధవి

ఇది పుష్పసారములతో నిండియుండు ఒక తాజాయైన మంచువంటి పరిమళపదార్థము. కొద్దిగ వ్రేలితో తీసికొని ముఖమునకు లేపనము చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖమున లేచు సోలె, మచ్చలు, మొటిమలు మొదలగువాటిని మాన్పును.

వెల బుడ్డి 1_కి 8 అణాలు

## మల్లిక

ఇది ముద్దుబిడ్డలకు మురిపమైన లేపనము. ఇది మైసూరు చందన అత్తరుతోను మల్లెమొగ్గల సారముతోను తయారుచేయబడిన నవీన నవనీతము. శిశువులకు దీనిని ప్రతిదినము స్నానానంతరము కొద్దిగ శరీరమునకు రాచుచుండిన చర్మము మృదువై బంగారురంగు నిచ్చి చర్మవ్యాధుల రాకుండ చేయును. ఈ లేపము వలన బిడ్డలు రబ్బరు చెండ్లవలె తేరుదురు.

వెల బుడ్డి 1_కి 8 అణాలు



## నీ చర్మ సౌందర్యమెంతో నీ వయస్సంత

క్రింది చర్మపు తైలగ్రంథులు పనిచేయనపుడే ముడుతలు గీతలు తెలుదేరును. పైచర్మమునకించి కఱకుదనము ప్రారంభించును. ఈ రెండు చర్మములను మంచి స్థితియందుంచును.

గీతలు ముడుతలు: ప్రతిరాత్రి పాండ్సుకోల్డు క్రీము పూసిన మానును. ఇది క్రిందిచర్మమునకు మంచి శక్తిని గొనిపోయి తైలగ్రంథులను కండరములను బలపరచును. ఇది రోమకూపముల శుద్ధిచేయుట వలన నల్లని మచ్చలు మాయును.

కఱకు చర్మము: పాండ్సు వానిషింగ్ క్రీమును పూసిన మాయమగును. పాండ్సు కోల్డుక్రీము ఉపయోగించిన తరువాత ముఖమునకు, మెడకు చేతులకుగూడ పాండ్సువానిషింగ్ క్రీము పూసి రాత్రంతయు నుండనిచ్చిన ఉదయమున చర్మము మృదువుగా నూతనముగా మనోహరముగనుండును.

ఉచితము: దీనిని నేడే పంపి పాండ్సు రెండు క్రీములట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్ .........రోజ్ క్రీమ్.........బ్రునెట్ ......

డాడ్జి అండ్ సెయ్మర్ లిమిటెడ్,
3, విటెట్ రోడ్డు, బొంబాయి.

పేరు..............................
చిరునామా......................No. GL.2.

"పశ్చిమదేశముల కొరకుగూడ ఉత్తమ నిర్మాణమార్గమును స్త్రీలతిత్వరగా నవలంబింతురు. ఇప్పటివలె విజ్ఞాన శాస్త్రములు మానవజాతి మారణమున కుపయోగపడునట్లు గాక మానవాభ్యుదయమునకు మార్గసూచకములగు రీతి గావింతురు."

"అంతియుగాక, ఫ్రాన్సునందు ఎన్నికహక్కులు లేక జర్మనియందు స్వాతంత్ర్యములేక యుండుటయు గూడ ముఖ్యముగ గమనింపదగినది" యనియు నుడివెను.

ఈ మహిళామణి వచించిన దానియందు సత్యముగలదు. పురుషులెల్లపుడు స్వార్థపరులై, ప్రపంచశాంతిని మానవకళ్యాణమును గాంక్షింపక, రాజ్యమునకో, ధనమునకో, పేరుకో ప్రతిష్ఠకో యితరజాతులతో కయ్యమునకు గాలు ద్రవ్వుచుందురు. వారట్లుచేయుటకు రాజ్యమందు వారికిగల సంపూర్ణాధికారమే కారణము. అట్టి యధికారమె మహిళల చేతియందున్నచో సహజముగ కోమల స్వభావులగు వారు మానవ మారణకృత్యముల జేయుట కెన్నడును పూనరని నమ్మవచ్చును. ప్రపంచమున స్థిరమగు శాంతినెలకొనవలయునన్న నిదిగూడ నొక యుత్తమ మార్గమే.

## మేకపాలే శ్రేష్ఠము

జాన్ దాసయ్య అనువారు "ఆరోగ్య"మను పత్రికయందిట్లు వ్రాయుచున్నారు. "ఆవుపాలకంటె మేకపాలయందున్న పెక్కు గుణములలో క్షయరోగనివారణము, జీర్ణకోశమునకుజేయు గొప్ప సహాయము ముఖ్యమైనవి. మేకపాలు త్వరగా జీర్ణమై, బలవృద్ధికి కారణమగుటకు హేతువేదియన అందుండెడు క్రొవ్వు విస్ఫు చిన్నకోశముల అరలు చాల పలుచగనుండును. జాఠరరసము వానిపై త్వరితముగ పనిజేయును. క్రొవ్వు పదార్థములలోకెల్ల యిందుండు క్రొవ్వు చాల ఉత్తమమైనది. వాసన రుచినిబట్టి మేకపాలు మంచివి గావందురుగాని అవి మన చేతులందున్నవి. మేకపాలు ఎట్టివాసనగాని లేకుండునట్లు చేయవచ్చును. ఆవుపాలు జీర్ణమగుటకు రెండుగంటల కాలము గావలసియుండును గాని మేకపాలకు 30 నిముసములు చాలును. మనము మేక, ఆవు, స్త్రీ వీకి పాలలోగల లోహములు, క్షారములు గమనించినచో, వీనియందెల్ల 12 విధములగు క్షారములు గలవు. ఈ 12 లో 9 మేకపాలయందును, 6 ఆవుపాలయందును 5 స్త్రీలపాలయందును, గలవు. ఆవుపాలయందు ఇనుము లేకనే యుండును. మేకపాలయందు 6 లేక 7 భాగములు ఇనుముండును. వస్తువులలోకెల్ల ప్రాణవాయువున కత్యంతసమీపమైనది క్షారము (Potassium). దీనికి తోడు మేకపాలయందలి యినుమును జీర్ణప ప్రాణవాయువును గ్రహించుశక్తి యితర యేపాలకన్నను అద్వితీయముగ నుండును.

## స్వాతంత్ర్యము లేనియెడల స్వాభావికగుణములుగూడ మారిపోవునేమో?

కథియవాడ సంస్థానమునుండి, ఆఫ్రికాదేశపు సింహము, కుక్కకుభయపడి పరుగెత్తిన విచిత్రవృత్తాంతము తెలియవచ్చుచున్నది. పెక్కేండ్లనుండి బోనులో నుంచబడిన యొకసింహము తప్పించుకొని తిరుగుచుండెను. కథియవార్ సంస్థానాధీశ్వరుడు అది నరహింస చేయుట ఆరంభించినచో చంపవలయునని యుత్తరవు గావించెను. ఆ సింహము తిరుగుచు నొకచోట కుక్కపరుండియుండగా దానివద్దకరిగి వాసనచూడ నారంభించెను. తటాలున ఆకుక్క మేల్కొని గంతులువేసి బిగ్గరగ మొరగనారంభించెనట. వెంటనే సింహము భయపడి ప్రాణభీతితో పరుగెత్తి తానుముందున్న బోనులో ప్రవేశింపగా నదటివారు దానినంతే మూసివేసిరట. నిర్బంధము సహజగుణములను పోగొట్టి ఆప్రాణికి ప్రపంచమే వింతగ కనబడజేయుననుటలో సందియముండదు.

# గ్రంథపరిచయము

**Modern Histoy of Needle-work** (పూచిత్రకళ)

84 పేజీలు. వెల 10. అణాలు. ఎస్. వి. నరసింహయ్యగారిచే రచియింపబడి, 12, గోవిందప్ప నాయకన్ వీధిలోనున్న పాటర్ ఎంపోరియమువారిచే ప్రకటింపబడినది. వివిధములైన కుట్టుపనులను, బాలికలు ఉపాధ్యాయుల సాయములేకనే స్వంతముగ నేర్చుకొనుటకు ఉపకరించును. ప్రతికుట్టుపనియు, దానికి కావలసిన సామానులు, ఆరంభించురీతి విపులముగ వ్రాయబడుటయేగాక ప్రతిబిమ్బమును చూపెడిచిత్రములు చక్కగ గలవు. తెలుగున నిట్టి పుస్తకము లేదనియే చెప్పవచ్చును. ప్రతి గృహిణికిని యిది చాల యుపకరించునని తలంచుచున్నాము.

**కూలోవా !**

ఏలూరు కూలిరక్షణ సంఘము వారిచే ప్రకటింపబడిన చిన్న పుస్తకము. డబుల్ క్రౌన్ 1/32 సైజు. 10 పేజీలు. శ్రీయుతులు వాసిరెడ్డి నాగేశ్వరరావుగారును గద్దె లింగయ్యగారును యిందలి గేయములను రచియించిరి. కడుపునిండాతిండు కట్టగుడ్డలు లేక దీనావృతిపాల్పడియుండు భారతీయ కార్మికుని కష్టాలు కన్నులకు గట్టినట్లు వర్ణింపబడినవి.

**ఆంధ్రపుష్ప బాణవిలాసము**

సంస్కృతమునుండి పలువూరు ఆంధ్రీకృతి పొందర్పబడువానిలో పుష్పబాణ విలాస మొక్కటి. దీనిని దేవగుప్తు వేంకటరమణకవిగారు ఆంధ్రీకరించిరి. మూలమునగల సౌరస్యమంతయు భారతవచన అనువాదములోనికి దెచ్చుట సులభముగాదు. అట్లయ్యును కవి సంస్కృతమునందలి రసమునుగాని, భావభావనపూర్వమును గాని విడువక చక్కగ నాంధ్రీకరించిరి. వీరి యాంధ్రీకరణము జదువుచున్నపుడు, ఆంధ్రసారస్వతమున సుప్రసిద్ధి కెంచిన వెలగపూడి వెంగనామాత్యుని యొక్కయు, యేనుగు లక్ష్మణకవియొక్కయు, ఆంధ్రీకరణములు తలంపునకు వచ్చుచుండును. ఈ పుస్తకమున పదునారు ఆంధ్రీకరణము చక్కగ గుర్తించుటకు శ్లోకము లోకవంకను దానికి సరియగు పద్యము లోకవంకను ప్రకటింపబడినవి. ఆంధ్రసారస్వతమున నరుదయ్యు, చక్కగనున్న యూ దెల్గుగీతములు లేని లోపములుగూడ గలవు. వెల 0-3-0 వలయువారు దేవగుప్తు వేంకటరమణకవిగారు, పెంపడం కరణం, రేగాపోస్టు వయా పెల్లిమర్ల, విశాఖపట్టణముజిల్లా అని వ్రాయవలెను.

# పత్రికాపరిచయము

## బ్రహ్మవిద్య

ఇది శ్రీయుత బ్రహ్మానందగిరిస్వామి వారి సంపాదకత్వమున వెలువడు మాసపత్రిక. (?) "కార్య కారణములుగానుండు సచ్చిదానందబ్రహ్మమును, ఆ బ్రహ్మమును ప్రతిపాదించు అపౌరుషేయ వేదధర్మమును, వైదిక, ధార్మికపారమార్థికాది విషయములను దెల్పు పౌరుషేయ వేదధర్మమును, పౌరుషేయాపౌరుషేయ వేదములచేత ప్రతిపాదింపబడక, ధాన్యబీజములగతి భూమి రోయంగుటట్లును, కర్మశిల్పులయొక్క గీతాగీతములు కాల మెఱుగనట్లును, దరిశంద్ర తారాగణముల యొక్క సర్వ మెఱుంగనిరీతిని, కార్యకారణముల గీతాగీతములను గమనింపక, యెందును సందులేక నిండి నిబిడీకృతమయియున్న పరిపూర్ణపరబ్రహ్మను తెలియుమార్గమును యీ పత్రికయందు ప్రకటింపబడును." పత్రికోద్దేశ్య మియ్యది. నూతనముగ పెక్కు పత్రికలు వెలువడుచుండుట శుభసూచకమే. కాని ప్రస్తుత ప్రపంచమున సర్వవిధముల వెనుకబడియుండు భారతదేశమున యీ "బ్రహ్మవిద్య"లతోలు విద్య లెంతవఱకు భారతీయులను ముందునకు దెచ్చునని సందియము తోచును. ఎట్లైన భారతదేశము బ్రహ్మవిద్యకు పుట్టినిల్లగుట దానిని పునరుద్ధరించుటయు తగినదే. ఈ పత్రికకు సం. చందా 1-4-0 విడిప్రతి 0-2-0. వలయువారు మేనేజరు, బ్రహ్మవిద్యాశ్రమం ఇప్పటం. పెదవడ్లపూడిపోస్టు, గుంటూరుజిల్లా అని వ్రాయగలరు.




## 49వ జాతీయమహాసభ

### విషయనిర్ణయసభ తీర్మానములు

49వ జాతీయమహాసభ సమయమున లక్నో మహానగరమున గూడిన విషయనిర్ణయసభయందు రెండు రాజకీయమతములు స్థిరముగనున్నటుల బయలుపడెను. మొదటిది జవహారిలాల్‌గారన్నవిధమున 'విప్లవ' మతము. దీనికి సామ్యవాదు లాధారభూతులు. రెండవది సంస్కారుల మతము. ఇతరులందరు దీనిని బలపరచిరి. మొదటి మతమును బలపరచినవారిలో ముఖ్యులు అధ్యక్షులు. ఈ సభయందు గావించిన తీర్మానములన్నిటిలో మూడు ముఖ్యమైనవి. వీనికై వాదోపవాదము లధికోత్సాహముతోఁ జరిగినవి. మొదటి ముఖ్య తీర్మానము భారతకాంగ్రెసుసంఘమునకు జనసంఖ్యనుబట్టి సభ్యులనెన్నుకొను పద్ధతి రద్దుచేయవలయుననుట. రెండవది కాయకష్టము—ఖద్దరు.

ఇది గత బొంబాయి కాంగ్రెసు సమావేశమునందు మహాత్ముని ప్రోద్బలమున గావింపబడియుండెను. క్రమక్రమముగ దీని కందరు నసమ్మతిఁ జూపుచు వచ్చిరి. రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు గూడ విముఖత జూపుచు వచ్చెను. లక్నో కాంగ్రెసుకమిటి కాయకష్టమును దొలగించి, ఖద్దరు ప్రాముఖ్యతమాత్రమే బలపరచెను. దానియందుగూడ విముఖతజూపనందులకు సంతసింపవలసినదే. ఏలన ఖద్దరుగట్టుట కలవాటుబడినవారే కాయకష్టమన నేమియో యెఱుఁగగలరు. కాయకష్టము నిర్బంధములేకున్న సులభముగ ఖద్దరుగొని కార్యనిర్వాహకసభ్యత్వము సంపాదింపవచ్చుట కేమి యాటంకముగలదు? అట్లని ఖద్దరుపై విముఖతఁ జూపుటగాదు. ఇంకను విచిత్రమైనవిషయము సామ్యవాదులకీ నిబంధన కష్టముగ నెందులకు గన్పింపవలయునను కే. వారి దృష్టిలోనుండు రైతులు కార్మికులే ముఖ్యముగ నీ నిబంధనల సాగించువారు. వారే ఈసంస్థ నడపుచో నిర్బంధనల దీసివేయు టెందులకు? కాని వారిలో నెవరును ఈ సంస్థయందు లేరనియేనా?

పదవీస్వీకరణమునుగూర్చి యీ సభయందు ఇదమిత్థమను విషయ మేమియుఁ దేలదయ్యెను. పదవీస్వీకరణ మొనరించి నూతనరాజ్యాంగవిధానముల కాటంకము గల్గింపవలయునని సంస్కారులవాదన. పదవుల స్వీకరించిన నూతనరాజ్యాంగవిధానము నామోదించినట్లగును, ఇంతవఱకు కాంగ్రెసు ప్రజలయందు గల్గించిన భావములకు

వ్యతిరేకముగ నుండునుగాన కూడదని సామ్యవాదుల వాదన. ఈ సామ్యవాదులను అధ్యక్షులగు జవహరిలాల్ గారు బలపరచినను వారివాదన నెగ్గకపోయెను. కాని తేలిన దేమియు లేదు. పదవీస్వీకరణమా లేదా యనువిషయమును నూతనరాజ్యాంగ విధానముప్రకార మెన్నికలు జరుగుటకు ముందో, వెనుకనో జాతీయసభా ప్రత్యేక సమావేశ మొకటి జరుగుననియు నందే విషయము తీర్మానింపబడుననియు నిశ్చయము గావింపబడెను. ఈ విషయము కార్యనిర్వాహకసభవారు కేవలము సభాధ్యక్షుని సంతసింపజేయుటకు మాత్రమే గావించిరేమో తెలియకున్నది. అట్లయినను జవహరిలాల్ నెహ్రూగా రా విషయమును అంగీకరించుట కల్ల. వారు స్పష్టముగ ఆత్మగౌరవమును విడనాడి అధికారపదవుల నంగీకరించుట వ్యక్తులకే యవమానకరమనియు జాతీయపునాదుల పెకలించుటయనియు, దేశమున కెంతమాత్రము లాభము లేదనియు వెల్లడించిరి. అట్టిచో యీవిషయమును యింకను నిల్పియుంచినందువలన నెవరికిని మేలు చేకూరదు. దేశ మెన్నియో కష్టసమస్యల నెదుర్కొనవలసిన యీకాలములో ఆ పదవీస్వీకరణ సమస్య తీర్మానమైయుండినచో ప్రజలలో శాంతి, నాయకులలో నొక పద్ధతి, కాంగ్రెసు లోన శక్తినంతయు నొకేవిషయముపై కేంద్రీకరించుటకు మార్గము గల్గియుండెడిది.

అధ్యక్షోపన్యాసము

ఇదివరకుం జరిగిన అఖిలభారతజాతీయ మహాసభాసమావేశము లన్నిటిలోనిది కాలదేశపరిస్థితులనుబట్టియు, కాంగ్రెసుముందుం గల కఠినసమస్యలంబట్టియు ప్రకృతము కాంగ్రెసు గావించిన తీర్మానములంబట్టియు, అధ్యక్షులు గావించిన మహోపన్యాసములంబట్టియు మిగుల ప్రసిద్ధమైనదనం దెల్లును. శ్రీయుత పండిత నెహ్రూగారీ సమయమునం గావించిన యుపన్యాసము సంపూర్ణ స్వాతంత్ర్యనినాదమును పూరించు విజయశంఖారావము. వారి దృష్టిలో భారతదేశ మెదుర్కొనవలసిన సమస్యలకును ప్రపంచమున నితరదేశము లెదుర్కొనవలసిన కఠినసమస్యలకును భేదము గాన్పింపదు. అన్ని దేశములందును సామ్రాజ్యభావము లోతుగ నాటుకొనియున్నందుననే ప్రజాసముదాయము పైకిరాంజాలక దాస్యముచే దారిద్ర్యముచే దారుణబాధలచే క్రుంగిపోవుచున్నది. ప్రపంచముతోం గూడ భారతదేశము బాగుపడదలంచుచో ప్రజాసామ్యవాదమే దానికి దివ్యౌషధము. రష్యాదేశ మీ సిద్ధాంతముచేతనే ప్రపంచమునకు మార్గదర్శియై పాఠము నేర్పుచున్నది. దీనిచే నొక్క స్వాతంత్ర్యసమస్యయేగాక రాజకీయ, ఆర్థిక, మత సమస్యలన్నియు పరిష్కారమగును గావున, పండితుని దృష్టిలో నిదియె వీనికన్నింటికిని తారకమంత్రమైనది. ప్రపంచములో శాంతి గలుగవలయునన్న, యిప్పుడు క్రమ్ముచున్న

యుద్ధమేఘము లంతరింపవలయునన్న యీ సామ్యవాదభావములే మిక్కుటముగ యుపకరించును.

మన దేశమందలి సమస్యలను గూర్చి ముచ్చటించుచు, నూతనరాజ్యాంగ విధానమునందు భారతజాతికి మేలుగల్గించునట్టి దేదియు విద్యుద్దీపికాసాయమున వెదికినను గాన్పింపదనియు దానిని సంపూర్ణముగా ప్రతిఘటించుటే పరమోద్దేశ్యమనియు వచించిరి. కాని వీరిదృష్టిలో పదవీస్వీకరణము పనికి రానిది. పదవీస్వీకరణ మొనర్చినచో ప్రజలయందు వానిపై వ్యామోహ మెక్కువయై సంపూర్ణస్వాతంత్ర్యాదర్శ సాధనమున కాటంకము తప్పక గలుగును. దాని వలన కాంగ్రెసువారికి సరియగు బలము గలుగదు సరిగదా దేశమునకు నుపయోగముండదు. కాని యితర నాయకు లట్లుదలంచుట లేదు. వారు మాత్రము పదవీస్వీకరణ మొనర్చి కృతకృత్యులుగాఁ దలంచుచున్నారు.

కాంగ్రెసునకును ప్రజాసముదాయమునకును ప్రకృతమున్న దానికంటె నెక్కుడు సంబంధము గల్గించి, వారి మూలబలమే ముఖ్యముగ జేసికొనవలయుననియు, వారియందు స్వాతంత్ర్యాభిలాష యెక్కువ జేయవలయుననియు పండితులు జేసిన సూచనలు మిగులశ్లాఘనీయములై యుండుటేగాక అఖిలభారతీయులకు సంతోషము గలుగఁ జేయునవై యున్నవి. వారు మహాత్ముఁడు భారతదేశమునకు గావించిన మహోపకారమును, భారతజాతికి వారి నాయకత్వమునఁగల నమ్మకమునుగూర్చి ప్రశంసించుచు, తిరిగి స్వాతంత్ర్యసమరమున వారి నాయకత్వమును భారతదేశము వాంఛించుచున్నదనియుఁ జెప్పి, వారియెడ తనకు భారతజాతికిఁగల గౌరవము నమ్మకమును వెల్లడించిరి.

వీరియుపన్యాసము గంభీరాశయములతో గూడి, జాతీయ అంతర్జాతీయ సమస్యాపరిష్కారములకు తోడ్పడునదై మానవకళ్యాణమునకు మార్గదర్శకమై యొప్పుచున్నది.

పండితుని యభిప్రాయము లందరెఱిఁగియే యున్నందున నాతని యుపన్యాసధోరణ యేరికిని యచ్చెరువు గల్గింపదు. తన యభిప్రాయములతో పెక్కుమంది యేకీభవింపజాలకున్నను వారు దానికి లెక్కింపక జాతీయసభ యందైకమత్యమునకై శక్త్యానుసారము పాటుబడెదనని వచించిరి. ఈ యైకమత్యముచేతనే కాంగ్రెసు సమావేశమునందు గావించిన తీర్మానములు కార్యరూపము దాల్పవలసియున్నవి. భారతదేశమందు రైతులదుస్థితి హృదయవిదారణమైనది. వారు దుర్భరదారిద్ర్యమునకు తోడు ఋణబాధతో క్రుంగిపోయియున్నారు. దానికి కారణములందఱకుఁ దెలిసియే యున్నవి. వీరిస్థితిగతులను బాగుపరచుటకై రైతుసంఘములతో, రాష్ట్రీయకాంగ్రెసు సంఘములతో సంప్రదించి ప్రణాళికలను తయారు శేయవలసినదని నిశ్చయింపఁబడినది.

దీనివలన రైతు సోదరుని దీనావస్థ బాగుపడునా? ప్రభుత్వ సాహాయ్యమావశ్యము గదా. కాంగ్రెసువారు తీర్మానించిన రీతి నూతనరాజ్యాంగ విధానముల ప్రతిఘటించిన ప్రభుత్వమువారి సాయము గలుగదు. ప్రతిఘటింపకుండుటకు కాంగ్రెసు ఒప్పుకొనదు. కావున నిది తప్పక విషమసమస్యయై చెలరేగును. పరస్పరవిరుద్ధములగు మతములుగల కాంగ్రెసు యీ సమస్యల నెదుర్కొవ కష్టపడవలసియుండును.

### మహిళాసమావేశము

భారతదేశమంతయు నేకగ్రీవముగా మహాత్ముని నాయకత్వమున స్వాతంత్ర్య సమరము సాగించెను. మహోన్నతత్యాగము గావించెను. కాని విజయము బడయలేదు. ప్రభుత్వము సడలదయ్యె. అందుచే అసంతృప్తి ప్రజలమధ్య బయలుదేరినది. మహాత్ముఁ డీ యుద్యమమునుండి మానుకొన్నాడు. కాని యీ కార్యరంగమున సాహసోత్సాహములతోఁ బనిచేసినవారెల్లరు వెనుకకు బోనొల్లరైరి. అందుచే పెద్దలగువారు శాసనసభాప్రవేశముల కాయత్తులైరి. కాని యువకసంఘమునకిది సరిపడునది గాదు కావుననే సామ్యవాదమునకు దిగిరి. యువకసింహమగు నెహ్రూగారు దీనికి మూలపురుషులు. వీరు భారతదేశ సమస్యలన్నియు సామ్యవాదములచే పరిష్కరింపవలయునని ఘోషించిరి. ఇట్టి పరిస్థితులలో మహిళామణులుగూడ నూతన మార్గములకు దిగకుందురా!

లక్నో కాంగ్రెసు సమావేశ సందర్భముననే మహిళామణులు శ్రీమతి సరోజిని నాయుఁడుగారి యాధిపత్యమున నొక్క ఆర్థికస్వాతంత్ర్యసభఁ జరిపిరి. ఈ సమావేశమును ప్రారంభించుచు శ్రీమతి విజయలక్ష్మి పండితులు, రాజకీయములతో సంబంధములేక కాంగ్రెసుపద్ధతి నవలంబించియే మహిళామణుల కార్థిక స్వాతంత్ర్యము గల్గించుట కొరక సంఘనిర్మాణ మావశ్యకమని సూచించుచు నిట్లు నుడివెను. "ఆర్థిక స్వాతంత్ర్య మొసంగని విద్యను నే లెక్కింపను. స్త్రీలకు దానివలన ఆత్మగౌరవాభివృద్ధి గలుగవలయును. గృహమునందు భర్తకుభారముగ నుండుటకంటె వారు గృహాదాయమును పెంపొందించు విద్య నభ్యసింపవలయును." విదేశవిద్యలన్నియు పాశ్చాత్యపద్ధతు లనుకరించుటకును, పురుషుల నాకర్షించుటకును, వారిపై నెల్లపుడాధారపడియుండుటకు మాత్రము పనికివచ్చుచున్నవనియు, వారి కన్నివిధముల జ్ఞానాభివృద్ధియు, సంపాదనాశక్తియు, ఆర్థికసౌకర్యములు గల్గింప సంఘనిర్మాణ మావశ్యకమనియు వారు వచించినదానితో నేకీభవింపగలము. భారతదేశ స్వాతంత్ర్యసంపాదనకు మూలబలమగు మహిళాభివృద్ధికి గావలసిన విధానములు అట్టి విధానముల నియమించు సంఘములును అత్యంతావశ్యకములే.

### నూతన రాజప్రతినిధి

నూతన రాజప్రతినిధులగు శ్రీ లిన్లిత్గో దంపతులకు, బొంబాయి, ఢిల్లీనగరములంద

ఖండ స్వాగత మివ్వబడినది. వీరు భారత దేశమునకు క్రొత్తగాదు. ఇదివఱకే వ్యవసాయపు రాయలుకమిషనరుగా భారతదేశమందలి పలుచోట్లను దర్శించి భారతదేశ పరిస్థితులనుగూర్చి చక్కగ నెఱిఁగిన వారే. వారు ఢిల్లీనుండి గావించిన బ్రాడుకాస్టు ప్రసంగము మిగుల మోదావహము గను ఆశావంతముగనున్నది. వారు సివిలు సర్వీసు ఉద్యోగులకు జెప్పిన విషయమెంతయు గమనింపదగినది. "మీ కష్టము లెటులున్నను గ్రామముల మరువకుడు. గ్రామములగూర్చి యెక్కువగ దెలిసికొనుడు. బల్లలవద్ద కలముపట్టి కూర్చొనుటకన్న గ్రామములమధ్య డేరాలలోనుండుటే ఘనతరము." రైతు శ్రేయముగోరు ఏయుద్యోగియైన నింతకంటె జేయవలసిన దేమి గలదు?

రాజప్రతినిధిగారు తన నిష్పక్షపాత బుద్ధిని జూపి తాము రాజకీయనాయకులతో ముఖ్యమైన విషయములను సంప్రతింతుమనియు, నట్లు జేసిన వారియెడ పక్షపాతబుద్ధితో వర్తింతురని యనుకొనఁగూడదనియు వచించిరి. దీనివలన దేశమున పరిస్థితులు బాగుపడునని దలంపవీలగుచున్నది. వారింకను నూతన రాజ్యాంగ విధానములను అమలులోనుంచుటకు ప్రజాదరణ ఆవశ్యకమనియు, నందుచే ప్రజలందరు తోడ్పడవలయుననియుఁ జెప్పిరి. ప్రజాభ్యుదయమును గోరు ఏ రాజ్యాంగవిధానమునకైనను తోడ్పడుట కెవ్వరు వెనుదీయరని యెంచుచున్నాము. వీరి ప్రథమప్రసంగమువలన గల్గిన సంతోషము అందలి ఆశయములు కార్యరూపము దాల్చినపు డినుమడింప గలదు.

**శ్రీయుత సర్ రాధాకృష్ణగారు**

పాశ్చాత్యప్రపంచమున ప్రాచీనసంస్థయగు 'ఆక్సుఫర్డు' విశ్వవిద్యాలయమున నూతనముగ స్థాపింపబడిన ప్రాచ్యతత్త్వశాస్త్రోపాధ్యాయులుగ నియమింపఁబడి, అచిరకాలముననే యాపీఠ మెక్కుటకు శ్రీయుత సర్వేపల్లి రాధాకృష్ణగారు ఇంగ్లండున కరుగనున్నారు. ఈవార్త దెలిసిన నాఁటినుండియు, వారిని ప్రశంసింపని పత్రికయు, అభినందింపని సంఘములును, ఆనందింపని ఆంధ్రులు నుండరు. దీనికంతయు కారణమేమి? ఇదియొక వ్యక్తికిగలిగిన గౌరవముమాత్రమెగాదు. అఖిలభారతదేశమునకు ప్రాచీవిజ్ఞానమునకు గలిగిన గౌరవము. ముఖ్యముగ నాంధ్రులు గర్వింపదగిన విషయము.

ప్రాచీనకాలమునుండియు, భారతదేశము పశ్చిమదేశములకు వెదజల్లిన అగణితమగు ధనరాసులకంటె వెలలేని విజ్ఞానదీప్తియే ముఖ్యమైనది. క్రమక్రమముగ విదేశీయులు ధనరాసులను కొల్లగొట్టికొనిపోయి దేశమున దారిద్ర్యదేవత తాండవింప జేసినను విజ్ఞానధనము మాత్రము పెంపొందుచునే వచ్చుచున్నందున పాశ్చాత్యులు భారతమాతను దానికై 'భవతిభిక్షాందేహి' అన వలసివచ్చుచునేయున్నది. క్షణభంగురములౌ సౌఖ్యముల కనుకూలమగు సంపదలు

సౌకర్యములు పాశ్చాత్యులు గలుగఁజేసి కొనఁగలరేగాని ఆత్మానందమొసంగు విజ్ఞానపుసరకు ప్రాగ్దేశములనుండి, అందు ముఖ్యముగ భారతదేశమునుండి, రవాణా గావలసినదే! అట్టి తరుణములందెల్ల ఏ వివేకానందులో, ఏ మహాత్ములో బైలుదేరి వారి యాత్మానందమునకు త్రోవజూపి మానవ కళ్యాణదాయకు లగుదురు.

సర్వేపల్లి రాధాకృష్ణులు భారతీయతత్వశాస్త్రముయొక్క పారమును జూచినవారు. పాశ్చాత్యులకు సులభముగ నార్యతత్వమవగాహమగునటుల, నాంగ్లపద్ధతియందే యపూర్వవ్యాఖ్యాన మొనర్పగల కూలంకష పాండితీపటిమగలదు. ప్రపంచమందలి వివిధమతములు, వివిధజాతులు, వానియాదర్శములు, ఆధ్యాత్మికదృష్టి, తత్వములు గనుగొను సూక్ష్మదృష్టియుఁ గొరవడదు. వీనికి తోడు యద్వితీయమై శ్రోతల భావనాప్రవాహముల నట్టె యరికట్టి తనవంకకుఁ ద్రిప్పుకొనఁజాలు మనోహరవాగ్ఝరి వీరికి బాసటయైనది. భారతవిజ్ఞానమును వీరి యమృతవాగ్ఝరి మూలమున పాశ్చాత్యప్రపంచమునకాత్మానందముగ జేయ పంపు భరతమాతకు వీరివలన అనశ్వరమగు కీర్తిగల్గుట కేమియు సందియముండదు. ఈ జ్ఞానధూతపదవి నిర్విఘ్నముగఁ కొనసాగ పరమాత్ముడు వీరియండ నెపుడు నుండుగాకయని కోరుచున్నాము.

హిందూస్త్రీలకు ఆస్తిపైహక్కు

భారతశాసనసభయందు డాక్టరు బి.వి. దేశముఖుగారు హిందూస్త్రీలకు ఆస్తిపై హక్కుండవలయునని కోరుచు నొక చిత్తుచట్టమును ఉపపాదించిరి. వారీ సమయమున చెప్పిన విషయములు భారతీయులు శ్రద్ధగా గమనింతురని యెంచుచున్నాము. "హిందూస్త్రీలను గూడ మానవులుగా గౌరవింపవలసిన యావశ్యకతను నాగరిక ప్రభుత్వములు గుర్తించుట మంచిది. జీవితమున్నంతకాలము పోషణకు లోపము లేకుండ చేయుచుంటిమిగదా! అంత మాత్రము చాలునని తలంచు టసమంజసము. ఎక్కువ స్వేచ్ఛగా జీవితము సాగించుటకు వీరికి హక్కుండవలయును. అటుల చేయవలయుననిన వీరికి ఆర్థికముగా కొంతబలము చేకూర్పవలయును. ఆరీతిగా వారికాస్తి నిచ్చుట మనపూర్వుల యాచారమైయున్నది." ఇతరమతములందు స్త్రీలకాస్తియందు భాగము గలదు. హిందూ సంఘమునందు లేకుండుట శోచనీయము. ఈ చిత్తుచట్టము త్వరలోనే ప్రభుత్వము వారి యంగీకారమునుబొంది శాసనమై స్త్రీలకుహక్కును గల్గించును గాక.

భార్య బ్రతికియుండ భర్త ద్వితీయ
వివాహ మాడవచ్చునా?

మొదటి భార్య జీవించియుండ భర్త ద్వితీయ వివాహమాడుట తగనిది. కాని హిందూసంఘమున నిరంకుశుఁడగు భర్త నీతి నొక్కొక్కమారు గమనింపడు. పతికి మారాడ వెఱచు భారతనారీమణి తన యెడ తప్పులేకున్నను భర్తకు వ్యతిరేక